# మాలతీ చందూర్
# ఇతర రచనలు

---

రేణుకాదేవి ఆత్మకథ (నవల)

క్షణికం! ,,

మాలతీ చందూర్ కథలు

పాప (కథల సంపుటి)



# చంపకం - చెదపురుగులూ

మాలతీ చందూర్



దేశి కవితా మండలి,
విజయవాడ-2.

దేశీ ప్రచురణ
ప్రథమ ముద్రణ
సెప్టెంబరు—1955
వెల : రూపాయిన్నర.

దేశీ ప్రెస్
విజయవాడ-2.



సంపాదకులు :
బొందలపాటి శకుంతలాదేవి
శివరామకృష్ణ

౧

"అదుగో, తాళం మళ్ళీ తప్పు వేస్తున్నావ్!"

పాడుతూపాడుతూన్న చంపకం పాట ఆపి టీచర్ వంక బెరుగ్గా చూసింది.

"క్రిందటివారం కూడా తాళం తప్పువేశావ్. మళ్ళీ అదే తప్పు ఇప్పుడూచేస్తే కొత్తపాఠం ఎలా చెప్పను? మామూలు కృతికే తాళం తప్పితే ఇంక రాగాలాపన ఎల్లా!" టీచర్ కళ్ళు దయగా నవ్వినా కంఠంలోని కోపానికి చంపకం బెదిరింది.

సాయంత్రం అయిదు గంటలు, గదిలో నీరెండ పడ్తోంది. టీచరు ఎర్ర చీరెమీద ఎండపడి గదంతా ఎర్రన యింది. తలుపు దగ్గిర అడుగుల చప్పుడు. నెమ్మదిగా ఎవరో గది తలుపు తెరుచుకొచ్చారు. పచ్చగా పొడుగ్గా వున్నాడు. లాంకోటు వేసుకు జరీసంచె కట్టాడు. ఆయన్ని చూడగానే ప్రియంవద టీచరు మొహంలో ఎంతో సంతోషం.

"రండి—ఎన్నాళ్ళకి దర్శనం" అంటూ నుంచుని కొత్తగా వచ్చినాయన్ని ఆహ్వానించింది. పిల్లలందరూకూడా నుంచున్నారు.

కుర్చీమీద ఆయన కూర్చున్న తరవాత పిల్లలు తమ సీట్లలో పతికిలపడ్డారు. పిల్లలు కొత్త మొహాన్ని పరికాయించి చూస్తున్నారు. టోపీ తీసి, ఆయన రుమాలుతో మొహం మీద, తలమీద తుడుచుకుంటున్నాడు. ఆయన బట్టతల

చూసేటప్పటికి చంపకానికి నవ్వు ఒకపట్టాన ఆగలేదు. ఆయన కూడా చంపకం వంక పరిశీలనగా చూశాడు.

"ఈయన రవి నాట్యమండలీ ప్రొప్రయిటర్. మన వూళ్ళో యీయనకు మూడు సినిమా హాళ్ళున్నాయి. రవీ థియేటర్ పేరు మీరు వినలా!" అంది-టీచర్ పిల్లలవంక తిరిగి. పిల్లలందరూ నమస్కారం చేశారాయనకు.

చంపకం పక్కనున్న తాసిల్దారుగారమ్మాయి "నేను నిన్ననే ఆ సినిమాకెళ్ళాను, టీచర్" అంది.

చంపకంవంక ఆయన మళ్ళా చూశాడు. చంపకం తల వంచుకొంది.

"మీరు నేర్చుకున్న పాటలు ఆయనకు విని పించరూ? నువ్వు పాడు కమలా!" అంది టీచరు.

ఎవరన్నా వస్తే పాడేవాళ్ళలో తను ఒకతెను కాదు గాబోలు ననుకుంది చంపకం.

కమల పాట పూర్తి అయింది.

"చంపకం, 'నీదు చరణములే' అన్న కృతి పాడు!"

చంపకం పాడింది. ఇంకా ఇద్దరు పిల్లలు కృతులు పాడి వినిపించారు.

పిల్లలు పాడుతున్నంతసేపు ఆయన ఎంతో శ్రద్ధగా కళ్ళు మూసుకున్నాడు. ఎప్పుడూ ఆరుగంటలకి వొదిలే సంగీతం స్కూలు, కొత్తాయన రాకవల్ల ఆరున్నరకి వొదిలారు. చీకటి పడుతోంది. చెప్పినటైముకు యింటికెళ్ళకపోతే, తల్లి ప్రశ్నలు

వేసి చంపుతుంది చంపకాన్ని. అందరు పిల్లలూ వొచ్చినా యన్నీ టీచర్నీ గూర్చి వేళాకోళం చేస్తూ నెమ్మదిగా నడుస్తు న్నారు. చంపకం చేతుల్లో సరిగ్గా అణావుంది. అణాపెట్టి బస్సు మీద వెళ్ళొచ్చు. పరుగెత్తి బస్సును అందుకుంది; రొప్పు కుంటూ బస్సులో పడింది.

పిల్లలంతానూ వెళ్ళిపోయారు. స్కూల్లో హీరాలాల్, ప్రియంవదా మిగిలారు.

"మిమ్ము కనిపించి నాలుగేళ్ళవుతోంది. బొంబాయిలోనే వుంటున్నారా ?"

"ఊఁ. మళ్ళీ వారంరోజుల్లో వెళ్ళిపోతా. కొత్త పిక్చరు మొదలుపెట్టున్నా. బీచికి వెళ్దామా—స్కూలు అయిపోయిం దిగా ?"

టీచరు ప్రియంవద, మిలియనీర్ హీరాలాల్ ఇసకలో కూర్చున్నారు.

"ఇందాక క్లాసులో 'నీదు చరణములే' పాడింది—ఆ. అమ్మాయి ఎవరూ ? చాలా బీద పిల్లలా వుందే ! కాని పిల్లలో మంచి చేనవుంది. మొహం కళ్ళూ బాగుంటాయి కదూ !"

"ఆ అమ్మాయి పేరు చంపకం. మొన్న సెప్టెంబరులో జేరింది."

"తండ్రెవరూ ?"

"లేడనుకుంటాను. అయినా నా కంతగా తెలియదు. సెప్టెంబరులో చేరింది. ఏదో సామాన్యంగా పాడుతుంది. నా

కంటికేం పెద్ద అందగత్తెలా కనపడలేదు. ఎప్పుడూ మాసిపోయిన గుడ్డలు వేసుకొస్తుంది."

"పిల్లకి పదహారేళ్ళు వుంటాయో వుండవో! కంఠంలో మంచి మాధుర్యం వుంది. కాని బీదరికం. పోషణవుంటే నేగా రాణింపు!"

"గ్రేటాగార్బో, నర్గీసూ అవుతుందంటారా? అసలు నా క్లాసుకి కాస్త ఉన్న పిల్లలే వస్తారు. ఈ చంపకమే అందరిలోకీ బీదదిగా కనిపిస్తుంది."

"ఆ అమ్మాయి రంభా, ఊర్వసీ కాకపోయినా తిండీ, బట్టా, అవకాశాలూ వుంటే అందమయిన మనిషి అవుతుంది. అందమయిన మొగ్గని సువాసనగల పువ్వుగా మార్చాలని ఎవరికుండదు?"

"మాటికీ, కోటికీ సేట్‌జీలాంటివారు ఒకరుంటారు."

"అవును, కళకోసం కడుపు మాడ్చుకో మనడం అన్యాయం. అలాగే కళాపోషణకి ఉపయోగపడని నా లక్షలు గులకరాళ్ళకంటే హీనమూ, అపాయకరమూ. చంపకం గురించి చాలా తెలుసుకోవాలని వుంది నాకు. పాపం ఆ పిల్ల మొఖంలో బాగా అలసట కనిపిస్తుంది. ఇంట్లో చాకిరీ కాబోలు!"

"ఏదో పత్రికాఫీసులో పనిచేస్తోందట."

"ఇంత చిన్నతనంలోనే వుద్యోగమా! పాపం వాళ్ళ ఎడ్రసు తెలుసా నీకు—నాకు తోచిన సహాయం చేస్తాను."

ప్రియంవదకి హీరాలాల్ చంపకంపట్ల చూపుతున్న అభిమానం నచ్చ లేదు. సేట్‌జీ చంపకానికి చెయ్యగల సహాయమేముంది? సంవత్సరానో రెండు సంవత్సరాల్లోనో వాళ్ళ దరిద్రం తీరుతుందా? మతిలేని పనులు చెయ్యడంలో హీరాలాల్‌కి మొదటి ప్రయిజ్. చంపకం అడ్రసు యిచ్చింది–ప్రియంవద.

౨

చంపకం తండ్రి పున్నయ్య. తల్లి రత్నమ్మ. చంపకం తండ్రి లక్ష్మణపురంలో ఏడెనిమిదెకరాల భూవసతివున్న సామాన్య రైతు. అతనికి ముగ్గురాడపిల్లలూ ఒక మొగపిల్లాడూ. కొడుకు సత్యనారాయణ పద్నాలుగేళ్ళు వచ్చేదాకా మిడిల్ స్కూల్లో చదువుకున్నాడు. భార్య రత్నమ్మ పోరుపడలేక సత్యాన్ని స్కూలుఫైనల్ దాకా చదివించేందుకు పక్కపట్నానికి పంపించాడు. అప్పటికి పెద్దమ్మాయి ఇందుమతికి పన్నెండేళ్ళు, రెండోపిల్ల చంపకానికి పదేళ్ళు. మూడోది రాధకి ఎనిమిదేళ్ళు.

ఆడపిల్లలకు తండ్రి పెట్టిన పేర్లు(వెంకటసుబ్బి, రామమ్మ, పేరిందేవి) బాగుండలేదని సత్యం పట్టణంనుంచి వచ్చిన తరువాత ఇందు, చంపకం, రాధగా మార్చాడు. "నా తండ్రి వరహాల మూట. నా కూతుళ్ళకి సినిమాపేర్లు పెట్టాడు" అని పొంగిపోయింది రత్నమ్మ. సత్యం పట్నంలోని స్కూలుకి వెళ్ళడం మొదలు పెట్టాడు–యింట్లో పిల్లలకీ పెద్దలకీ దర్జాలూ బట్టలూ తగ్గటం మొదలెట్టాయి. పెద్దమ్మాయి యిందుకి పన్నెండేళ్ళకి

గుణింతాలు వచ్చాయి. చారకం, రాధా, ఆడపిల్లలనూసి చదువు మాన్పించారు.

సత్యానికి స్కూలు చదువుకంటె నాటకాలమీద ప్రీతి ఎక్కువయింది. కొడుకు పెద్దయి పిల్లల్నీ తండ్రినీ పోషిస్తాడని ఆశపడేది తల్లి. సత్యం నెమ్మదిగా స్కూలుఫైనలుకొచ్చేటప్పటికి చెల్లెలు తెలుగులో ఇంగ్లీషురీడరు పూర్తిచేసింది; ఇందు కాంపోజిషన్లుకూడా తనే రాసిపెట్టేది. రాధ గుణింతాలలో వుంది. సత్యానికి స్కూల్లో చదువుకంటె యితర యావలు ఎక్కువయి స్కూలుఫైనల్ తప్పాడు. తండ్రి తమకి చదువు లబ్బదనీ, పూర్వంలాగే సుబ్బయ్య శ్రేష్టిదగ్గర గుమాస్తాగిరీ చేయమనీ కొడుక్కి హితబోధ చేశాడు. కాని రత్నమ్మ కొడుకు పక్షం. "చిన్నతనం కాబట్టి ఒకసారి తప్పాడు. అయినా యిన్ని క్లాసులకి ఒక్కక్లాసేగా తప్పింది! గుమస్తాగిరీ వద్దు. సత్యానికి ప్లీడరీ చెప్పించాలి" అని పట్టుబట్టింది. సత్యం మరునటి ఏడాది స్కూలుఫైనలు పాసయాడు. కాలేజీచదువు మద్రాసులో బాగుంటుందని తల్లి దగ్గిర మంతనాలు మొదలెట్టాడు. పున్నయ్య పెళ్ళాంమీద ప్రథమకోపం చూపించాడే గాని కడకు ఆవిడమాటే నెగ్గింది. రెండెకరాలు అమ్మి సత్యాన్ని మద్రాసు చదువులకి పంపించారు. మూడునెల్లు తిరగలేదు; తండ్రి అకస్మాత్తుగా జబ్బుచేసి చచ్చిపోయాడు. వ్యవసాయమంటే సత్యానికి మొదటినుంచీ తెలియదు. అంచేత తల్లి పల్లెటూరులోని కొంపా పొలమూ అమ్మేసి చిల్లరప్పులు దీర్చి, మూడువేలపై చిల్లర బాంకులోవేసి, ముగ్గురు ఆడ

పట్నం జేసుకుంది. సత్యం తెప్పరిల్లేసరిగా సంసార భారం వహించవలసి వచ్చింది.

పెద్దపిల్ల యిందుకు చదువు అబ్బలేదు. తల్లికి యింటి పనుల్లో సాయం చేస్తోంది. చంపకం ఫోర్త్‌ఫారమూ, రాధ ఫస్టు ఫారమూ చదువుతున్నారు.

రత్నమ్మకి భర్తపోయాక, సాలీనా ఆదాయం లేదు. కొడుకుని వొదిలి దూరంలో వుండటం ఇష్టంలేక ఆ పట్నం లోనే కలోగంజో తాగొచ్చు ననుకొంది. సత్యం వృద్ధిలోకి వచ్చి తమ కుటుంబాన్ని ఒక వొడ్డుకు తీసుకురాగలడని ఆమె ఆశ.

రత్నమ్మకి అబ్బాయి సత్యం, పెద్దమ్మాయి యిందూ ఒక ఎత్తు; మిగిలిన యిద్దరు పిల్లలూ ఒక ఎత్తు. సత్యం, యిందూ చిన్నపిల్లలుగా వున్నప్పుడు రత్నమ్మ కష్టాలంటే ఏమిటో ఎరుగదు. పిల్లలిద్దర్నీ అల్లారుముద్దుగా పెంచుకుంది. పెద్దపిల్ల యిందు మందకొడి, అగ్లనాకారి, కురూపికూడా. తెలిసినవాళ్ళందరూ ఆ పిల్లకి పెళ్ళెలా అవుతుందా అను కుంటూండేవాళ్ళు. ఆమెకి చదువుకూడా అంటలేదు. తల్లి కళ్ళకు యింకా ఎప్పుడూ పాపాయే! యిందుకు పెళ్ళికాదే అని మనసులో బాధపడేది రత్నమ్మ.

చంపకం, రాధా తల్లి ప్రేమంటే ఏమిటో మర్చి పోయారు. ఇందుచేసే వెకిలిపనులకు ఎదురుతిరిగి నోరెత్తేవాళ్ళు కాదు. అన్నా, తల్లీ వినకుండా పెద్దపిల్ల యిందును వెనకేసు కొస్తుంటే చిన్నపిల్లలిద్దరికీ వళ్ళు మండిపోయేది. రాధ, చంపకం జట్టు.

జార్జిటవున్‌లో ఒకమూల సందులో చిన్నగా ఇల్లు తీసుకున్నారు వాళ్ళు. మూడుగదులు. ఒక గది సత్యానికి ప్రత్యేకం. రెండోది మిగతా వాళ్ళందరికీ. మూడోది వంట గది. చంపకానికి మొదటినుంచీ స్కాలర్‌షిప్పే. దానికి మాత్రం సగం జీతం కడుతూండేవాడు.

తండ్రి పోయినప్పటినుంచీ సంపాదన లేకపోయినా సత్యానికి అధికారంమటుకు చాలాసయింది. తన ప్రతిష్ఠ పెరిగింది. ఇంటికి వచ్చేటప్పటికి స్నానానికి నీళ్ళు, కాఫీ ఫలహారాలు సిద్ధంగా వుండాలి. తల్లికి కొడుకుమీద ప్రేమైతేనేమి భయమైతేనేమి సత్యానికి కావలసిన వాటికి లోపం చేసేదికాదు. సత్యం ఇంటరు పరీక్షలో డింకీకొట్టాడు. కాని తను కాలేజీ డేనాడు వేసిన నాటకంలోని పాత్ర అందరూ మెచ్చుకోవడంవల్ల తను లాయరు కాకపోయినా నటకుడు కావడం మాటుకు ఖాయం అనుకున్నాడు. సత్యానికి నాటకాలపిచ్చి ఆనాటినుంచీ హెచ్చవసాగింది. తనో పెద్ద నటుడు కాగలననుకునేవాడు. రోజూ అథవా ఒక గంటయినా అద్దందగ్గర పోజులువేస్తూ చూసుకునేవాడు. కళ్ళుతిప్పటం, కనుబొమలు ముడివేయడం తల వారగేయడం మొదలయిన నటకుని లక్షణాలు అలవర్చుకోడం ప్రారంభించాడు.

చంపకం స్కూల్ ఫైనల్ పరీక్షకూ సత్యం మూడోసారి ఇంటర్ పరీక్షకూ వెళ్ళారు. చంపకం పాసయింది. కాని సత్యం మూడు పార్టులలో తెలుగు ఒక్కటే పాసు కాగలిగాడు. తల్లీ కొడుకులిద్దరూ ఒకటై చంపకం చదువు ఆపు చేయించారు.

"నాకు తెలియకుండా ఉత్తరాలు రాయడం కూడా మొదలెట్టవా !" అన్నాడు సత్యం పళ్ళు కరచుకుంటూ.

ఇందు యికిలించింది. రాధ "మా చంపకం రచయిత్రి అయింది" అంది హేళనగా.

ఒకేసారి ఇన్ని రిమార్కులు విన్న చంపకానికి పెద్ద పెట్టున ఏడుపొచ్చింది. అచ్చులో తనపేరు పడిందన్న సంతోషం పాలపొంగులా అయింది. తనుచేసిన పొరబాటేమిటి ? వ్యాసపోటీ వ్యాసం రాసింది. దానికి మొదటి బహుమానం వచ్చింది. ఎందుకు యింట్లో అందరికీ ఈ చిరాకు ?

సత్యం ఏదో వుద్ధరిస్తున్నట్టు సాయంత్రం చంపకాన్ని పత్రికాఫీసుకి తీసుకెళ్తానన్నాడు. మూడున్నరకి దాచిదాచి వుంచిన సోపుతో మొహం కడుక్కొని, యిందుని బతిమిలాడుకుంటే యిచ్చిన యానాం సిల్కు పమిటపరికిణీ వేసుకుంది. అన్నగారివెంట మేకపిల్లలా వెళ్ళింది. ఎడిటర్‌గారు సత్యాన్నీ చంపకాన్నీ కూచోమన్నారు. చంపకం భయపడ్తూ సిగ్గుగా పక్కకివొదిగి కూచ్చుంది.

"అమ్మాయి వయస్సెంత ?"

"పంధొమ్మిది"

చంపకం వులిక్కిపడి సత్యంవంక చూసింది. చంపకం కళ్ళని కలుసుకోకుండా పక్కకు చూశాడు. చంపకం వయస్సు పదహారు. చిన్నప్పుడు పొద్దున్నే వాళ్ళవూళ్లో వున్న రామ మందిరంలోకి వెళ్ళి "నేను అబద్ధం ఆడకుండా కాపాడు" అని ప్రార్థిస్తూ చెంపలేసుకునేది. పట్నంవచ్చినా చంపకం ఈనాటి

వరకూ అబద్ధం ఆడటం తప్పుఅనే భావంలో వుంది. అల్లాం టప్పుడు సత్యం చంపకానికి పంథొమ్మిదేళ్ళని బొంకి చెప్పాడు.

"వాళ్ళ స్కూల్లో మాగజైన్‌కి కూడా కొన్ని గొప్పో రాస్తూండేది. చిన్నప్పటినుంచి సాహిత్యంమీద మంచి అభి రుచి వుంది. దానికి మేమంతా దోహదం యిస్తున్నాం. మీ ఆఫీసులో అవకాశముంటే దానికి కాస్త చోటివ్వండి. రెక్కల కష్టంమీద బతకాలి. సంసారం నా వొక్కడి సంపాదనతో గడవటం కష్టంగావుంది"...అంటున్నాడు సత్యం.

చంపకానికి చెమటలు పోస్తున్నాయి. అన్నీ అబద్ధాలే. చంపకం రాయటం యిదే మొదటిసారి. ఇంట్లో యిచ్చింది దోహదంకాదు, తిట్లు. సత్యం ఇంతవరకు చిల్లిగవ్వాన్నా సంపా దించలా. అంతా వాళ్ళ నాన్నడబ్బే. మనుషులెంత తేలిగ్గా అబద్ధాలాడతారు! కొత్త ప్రపంచంలోకి వస్తోంది చంపకం.

"మా కిప్పుడెవరూ అక్కర లేదు. కాని అమ్మాయి సమగ్రతచూచి కాదనలేకుండా వున్నాను. మొదటి రెండు నెలలూ – అనగా ట్రయినింగ్ పిరియడ్‌లో ఏమీ యివ్వం. ఆ పైన నెలకి నలభైతో ప్రారంభిస్తాం."

"మీ మేలు మర్చిపోలేను. రేపటినుంచి పనిలోకి వస్తుంది" అంటూ శెలవు తీసుకున్నాడు సత్యం. వచ్చేటప్పుడు చంపకం ఆయనకు నమస్కారం చేసింది. ఆయన చిరునవ్వు నవ్వాడు.

ఎడిటర్‌గారి యిల్లూ ఆఫీసూ ఒకటే. ఆనాటినుంచి చంపకం సిరాబుడ్లు కడగడం ఎడిటర్ గారమ్మాయికి కాఫీ

కాచిపెట్టడం, వాళ్ళబ్బాయికి లెక్కలు చెప్పడం, ఫైళ్ళు సర్దడం — ఒకటేమిటి ఇంటిపనీ ఆఫీసుపనీ అన్నీ చేసేది. పాత పేపర్లలోని జోక్స్ కాపీకొట్టడం, ఏదైనా కథలో భాగం కాపీ చేయడం యిల్లాంటి పనులన్నీ చేసేది. చంపకం కొత్త రాయడం మొదలు పెట్టింతరువాత కూడా సొంతంగా రాసేది కాదు. చంపకం రాసిన వ్యాసాలేవీ 'ఒరిజినల్' కావు.

సత్యంకూడా యీ లోపల ఒక మార్వాడీదగ్గర నలభై అయిదు రూపాయలకు గుమాస్తాగా కుదురుకున్నాడు.

## 3

చంపకం వుద్యోగంలో చేరి ఏడాది అయింది. క్రమంగా ఎడిటర్ గారి భార్యా పిల్లలదయ సంపాదించింది. పత్రికలో కూడా రాయడం నేర్చుకుంది. ప్రశ్నలకు ప్రత్యుత్తరాలు, జోక్సు మొదలయినవి రాస్తూండేది. జీతం నెలకు నలభై. ముప్ఫయిరూపాయలు తల్లికిచ్చి మిగిలిన పదీ స్వంతఖర్చు కుంచుకునేది. ఆ డబ్బుతో సంగీతానికి, బస్సులకీ పత్రికలకీ—అవీ ఆమె స్వంతఖర్చులు.

ఈ లోపల సత్యం మూడు ఆఫీసులు మారాడు, జీతం నలభై అయిదునుంచి ముప్ఫైఅయిదుకు దిగింది. నెలకు పది హేను స్వంతఖర్చు కుంచుకుని మిగతాడబ్బు తల్లి చేతుల్లో పోసేవాడు.

హీరాలాల్ చంపకాన్ని సంగీతం క్లాసులో చూసిన మునసటి సాయంత్రం అయిదుగంటలకి సత్యం ఇంటికొచ్చాడు. నాటకంలోని తనపోర్షన్ కంఠతా పట్టేందుకు రెండుమూడు

రోజుల నుంచి హాజరౌతూ వస్తున్నాడు సత్యం. లక్ష్మి నాటక మండలిలో సభ్యురాలు. నాటకంలో కథానాయకుడి పెద్దకూతురు వేషం వేస్తున్నది. సోగ్గను రెండు పేజీలన్నా లేవని నిరుత్సాహపడ్డాను. కాని ప్రతి గొప్ప నటుడూ ముందు ఇల్లాంటి చిన్న వేషాలువేసే పైకి వచ్చారని తనలో తను సరిపెట్టుకున్నాను.

ఆ రోజు శనివారం. ముందుగదిలో రాధా, యిందూ, రత్నమ్మా కూర్చునివున్నారు. రాధ పిల్లిపిల్లను పక్కను పెట్టుకొని హిందీ పుస్తకం చదువుతోంది. రత్నమ్మకి పిల్లుల్ని చూస్తే అసహ్యం. "చదువుకుంటూంటే పక్కన పిల్లెందుకే" అని కూతుర్ని మందలించబోయింది. కాని రాధ దంపకానికి మళ్లీ గుస్తీగా కాక్కాడు - ఒకటికి నాలుగు సమాధానాలు చెప్తుంది.

"రాధా - సత్యం వచ్చేవేళ అయింది. సాంబారు కాగిందో లేదో చూసిరా ?"

"నేను పరీక్షకు చదువుకుంటున్నా. ఇందును వెళ్ళి చూడ మనరాదూ ?"

"పరీక్షకు చదువుతున్నావ్, పిల్లిని పెట్టుకు ఆడుకుంటున్నావ్ ! ఇందుమీద పడిపోతావేం ? దానికి వోపికెక్కడుంది? పొద్దుటనుంచి పని చేయడం లేదూ ? పాపం వాడు పగలంతా చాకిరీ చేసివస్తాడా ! వచ్చేవేళకి భోజనం సిద్ధంగా వుంచొద్దా! అందరి పిల్లలకీ అన్నలంటే ఆపేక్ష !"

"అందరి అన్నలకీ చెల్లెళ్ళంటే ప్రేమవుంటుంది–" మాట పూర్తిచెయ్యకుండా సత్యం గదిలో అడుగుపెట్టాడు. రాధనంక తినేసేటట్టు చూశాడు. రాధ తల వంచుకుంది.

"ఏమిటా పుస్తకం ?"

"హిందీ టెక్స్టు"

"ఏమన్నా అర్థం అవుతోందా ?"

"అర్థం కాకపోతే చదువుతారా?" అంది రాధ చురుగ్గా.

"అబ్బాయ్ కాళ్ళు కడుక్కోరా" అని రత్నమ్మ అనడంతో అందరూ వంటింట్లోకి వెళ్ళారు. రత్నమ్మ కొడుకు పళ్ళెంలో నాలుగు రొట్టెలుపెట్టి, గిన్నెలో సాంబారు పోసింది.

"అబ్బా – రోజూ రొట్టెలేనా ?" అన్నాడు విసుగ్గా సత్యం.

"నీకా రొట్టెలన్నా కడుపునిండా వున్నాయి. మాకు రెండేసేగా ! చాలినా చాలకపోయినా నోరెత్తకూడదు."

"అదేమిటే – పిల్లాడు పొగలంతా రెక్కలు విరుచుకు యింటికొస్తే అల్లా మాట్లాడుతావ్ – వాడి సంపాదన మన కోసం కాదూ ?"

"పొద్దుటినుంచీ చెమటోడ్చి చేసేది అన్నయ్యొక్కడేనా ఏమిటి ? చంపకం చెయ్యడంలా ? దానికి కడుపునిండా వుంటుందేమిటీ యింట్లో ?

"అది గడుగ్గాయి. దాని మాటలకేం తిను నాయనా" అని సర్దింది తల్లి.

"చంపకం ఏదమ్మా? యివ్వాళ కెలవేగా?"

"సంగీతం నేర్చుకునేందుకు వెళ్ళింది రా"

"ఆఫీసుకు ఎల్లాగ ఆడపిల్ల వెళ్ళడం తప్పదు. ఈ సంగీతానికి కూడా ఎందుకు రోడ్లమ్మట తిరగడం? అసలు మన పిల్లలాంటి వాళ్ళకు కాదు ఆ పత్రికాఫీసు, ఇల్లూ సంగీతానికి, పుస్తకాలకీ టైమూ డబ్బూ తగలేయకపోతే హిందీ భాషా జ్ఞానం వృద్ధి చేసుకోకూడదూ? ఏమున్నా కథలు గిట్టుబాటు చేస్తే డబ్బు దొరుకుతుంది. లేకపోతే సాయంకాలం కుట్టుక్లాసుకు వెళ్ళకూడదూ? కత్తిరింపులు నేర్చుకుంటే యింట్లో కూచుని కుట్టొచ్చుగా?"

'వాళ్ళ కమల కుట్టుక్లాసుకు వెళ్తోంది కాబోలు. కమలకీ తనకీ మధ్య చెల్లెల్ని దూతికలా వుంచుకునేందుకీ పన్నాగం' అని మనసులో అనుకుంది రత్నమ్మ. రాధ గొంతు సవరించుకోవడంలో దృష్టమైపోయింది, రత్నమ్మ అనుమానం.

కమల గంగయ్య కూతురు. గంగయ్య లక్ష్మీ నాటక మండలికి పెట్టుబడిదారు: ఆయన దగ్గరకు తీసిన రమణమ్మకి నాటకాలంటే పిచ్చిగా వుండేది. రమణమ్మ కులంచెడ్డ మనిషి అంటారు. వెనక రమణమ్మ కూడా నాటకాల్లో వేస్తూండేది—రెండేళ్ళ క్రితమే చచ్చిపోయింది. రమణమ్మకు పుట్టినపిల్ల కమల. కమలకి తల్లిలాగానే నాటకాలంటే ఇష్టం. పలుగుర్నీ వూసుకు తిరుగుతుంది. రత్నమ్మగారింటికి రెండుమూడుసార్లు వచ్చింది. పొడుగ్గా చామనచాయగా వుంటుంది. సత్యానికి కమలమీదున్న అనురాగం రత్నమ్మకి నచ్చదు. సత్యాన్ని

తన దగ్గరనుంచి కమల బలవంతంగా లాక్కు—పోతున్నట్టు భావించేది. సత్యం—కమలా రత్నమ్మకి తెలియకుండా ఒకరినొకరు ప్రేమించుకున్నారు.

"దానికి పస్తుమీద అభిలాష. లేదురా. ఏదో గొంతు బాగుంటుంది. దాని ఖర్మానో అది చేసుకుంటుంది. నీకెందుకు?"

"అదేమిటమ్మా, అందరూ అభిలాష వున్నవే పనులు చేస్తున్నారా? నాకు నాటకాల్లో వేషాలెయ్యాలనివుంది. నెమ్మ గలను కాదాను. అందుకని వుద్యోగం మానుకుంటున్నానా! ఆ బల్లదగ్గిర కూర్చుని చేతులు అరిగేట్టు రాయడం లేదూ? తలుపు చప్పుడవుతోంది చూసిరా రాధా."

రత్నమ్మ గబగబా వెళ్ళింది.

"నువ్వెన్నప్పుడన్నా అమ్మకి విశ్రాంతి యివ్వకూడదూ."

"నేను వూరికే కూచున్నానా? సరళలూ, నాటకాలు కాదు నే చదివేది. క్లాసు పుస్తకం" అని రాధ జవాబిచ్చింది.

"ఎవరూ లేరూ" అంటూ రత్నమ్మ వెనక్కి వచ్చింది. "గంగయ్యగారింటికి కెళ్ళావా" అని అడిగింది కొడుకుని.

"వెళ్ళొద్దూ! వొచ్చేవారం నాటకముంది. పాపం, వాళ్ళ కమలే నాటకం అంతా కాపీ చేసింది. నా పోర్షను కూడా రాసిచ్చింది. వల్లించుకోవాలి. మిగతావాళ్ళా నా గది లోంచి లేవాలి. నా పోర్షను కంఠతా పట్టాలి— రాధా— యిందూ ఓమ్మ లేస్నీ"

"అన్నయ్యా నాటకంలో నీకూ కమలకీ పెళ్ళవుతుందా?" అంది యిందు అమాయకంగా.

"ఏమిటా మాటలు!" అని గదిమాడు సత్యం.

"నీకెందుకే వెర్రిపిల్లా" అంది తల్లి.

"నాకు వచ్చేవారం పరీక్షలు—చదువుకోవాలి" అంది రాధ.

"వంటింట్లోకెళ్ళి చదువుకో" అంది తల్లి.

"వంటింట్లో చీకటి."

"బెడ్లయిటు పెట్టుకు చదువుకో—శుభ్రంగా వుంటుంది—"

"అయితే అక్కడ సత్యాన్నే చదువుకో మన కూడదూ."

"అదేమిటే మొగపిల్లాడు వాడు—అట్లాంటావ్"

"పెద్దలైటు వెలిగించుకుంటా."

"అందులో కిరసనాయిలు ఆట్టే లేదు. రాత్రి వాడికి కావద్దుటే—ఆడపిల్లవు నువ్వు—చిన్నలాంపు పెట్టుకు చదువుకో"

"కిరసనాయిలు ఎప్పుడు చంపకం యిస్తోంది — సత్యం కానుగా" అని రాధ వంటింట్లోకి జారుకుంది.

ఇందు ఇకిలించింది.

తల్లీ కొడుకూ మొహాలు చూసుకున్నారు.

"ఈ పట్నం చదులవుతో చిన్నపిల్లలిద్దరి గొంతుకూ హెచ్చిపోయింది. చంపకానికి తెలివన్నా వుంది. ఈ రాధకీ రోజురోజుకి నోరు హెచ్చిపోతోంది." అని మనసులో అను

కుంది తల్లి. "దాని మాటలకేం నువ్వు చదువుకోరా - ఇంద్రూ రావే—సీతమ్మగారింటికి వెళ్ళొద్దాం!"

౪

సత్యం గదిలోకి వచ్చి తలుపు మూసుకున్నాడు. వంటింట్లో రాధ గట్టిగా హిందీ చదువుతోంది. ఈ నాటకంలో సత్యం రాజీలా వుండాలి. హీరోయిన్ చెలిని వుద్దేశించి, "ఆనాడు మల్లెచెట్టు నీడలో చూశాను. వెంటనే ప్రేమించాను. ఎంతో సుకుమారంగా వున్నావ్ - నువ్వు నుంచున్న చోటు కూడా ఎంతో అందంగా వుంది" పోర్షన్ కంఠతా పట్టేందుకు తంటాలు పడ్తున్నాడు. లక్ష్మీ నాటకమండలిలోని నటకు లంతా ఏభైఏళ్ళ పైబడ్డవాళ్ళు. బతికున్న రచయితల నాటకం వేస్తే డబ్బివ్వవలసి వస్తుందని కీర్తిశేషులైన వారివే ఆడుతూ ఉంటారు. మాటలు, యాక్షను అంతా ఆ తాతయ్యలు చెప్పి నట్టే చెయ్యాలి. సత్యం తనకు నచ్చినట్టుచెప్పి మెప్పుపొందా లని చూశాడు. కాని అసలు నాటకంలో వెయ్యనియ్యరేమో నని వాళ్ళు చెప్పినట్టే వింటున్నాడు. కమల హీరోయిన్ వేషం తనకోసం వెయ్యకుండా వుంచుకుంది. చిన్న పోర్షనయినా సరే నని చెలివేషమే తీసుకుంది. కమలను తల్చుకునే టప్పటికి సత్యం కంఠతా పట్టడం కుంటుపడింది. గోడకు కొట్టిన అద్దం దగ్గర నుంచుని పోజులు మొదలెట్టి గట్టిగా, "ఆనాడు మల్లె చెట్టుదగ్గిర. . ." అనివాక్యం చదువుతున్నాడు.

ఇంతలోకే రాధ, "అన్నయ్యా, ఎవరో వచ్చారు—" అంది.

ఎవరా అని పక్కకు తిరిగేడు. ఎవరో పెద్దమనిషి - కొత్తవాడు. లాంగ్‌కోటు, జరీసంచా, టోపీ, పచ్చగా దబ్బ పండులావున్నాడా వచ్చినాయన.

"నమస్తే. నా పేరు ఆ అమ్మాయికి వినిపించ లేదు కాబోలు. నన్ను హీరాలాల్ అంటారు."

సత్యానికి కళ్ళు తిరిగాయి. కిందపడ్డంత పనైంది. "అంటే రవీథియేటర్ హీరాలాల్ తమరేనా?"

"అవును. అది అమ్మేద్దామనుకుంటున్నాను. సరిగా లాభించడంలేదు. ఆ అమ్మాయి మీ చెల్లెలా? చిలకలా వుంది. పన్నెండేళ్ళుండవ్!"

"అవునండీ మా చెల్లెలే. పదిహేడో ఏడు." సత్యానికి చెల్లెళ్ళ వయస్సు విషయంలో అబద్ధం ఆడడం అలవాటయింది. "దానికి పడిశం పట్టింది, కొంచెం చెవుడు...పనిపిల్లా!..." అంటూ ఆగిపోయాడు.

హీరాలాల్ దయగా అతనివంక చూశాడు - వాక్యం పూర్తిచెయ్యండి అన్నట్లు.

"పనిపిల్ల బయటకెళ్ళింది గాబోలు. మీరు మాయిల్లు పావనం చేశారు. ఈరోజు సుదినం. కూర్చోండి." అంటూ కుర్చీవేశాడు. తను పక్కనే కుర్చీపీటమీద కూర్చున్నాడు.

"మీరు మా యింటికి రావడం మా అదృష్టం. నాకు కళ అంటే అభిమానం. రేపటివారం నాటకం వేస్తున్నాం. నా పోర్షను చదివేస్తున్నాను. నాఅరుపులు వినపడేవుంటాయి."

"వస్తూంటే వినపడ్డాయి" హీరాలాల్ కంఠంలో ఏ మాత్రం హేళనగాని, నిర్లక్ష్యంగాని లేదు. పిల్లవాడికి బోధించినట్టు "చూడు నాయనా - 'షుకుమారం' అంటున్నావ్ - అది తప్పు. 'సుకుమారం' అనాలి" అన్నాడు.

"మేము 'అడుగుజాడలు' నాటకం వేస్తున్నాం. గొప్ప నాటకంకాదు, అయినా ఫరవాలేదు." గొంతుకొచ్చకుంటున్నాడు.

"నాకు తెలుసులే. ఆ రాసినాయన నా చిన్ననాటి స్నేహితుడు. చాలా రోగిష్టి. అప్పుడేపోయి పదిహేనేళ్ళయింది. కంఠాన్ని కొంచెం మార్దవంగా తీసుకురా నాయనా!"

"నాకు మంచి గొంతు వుందంటారా ?"

"ఫరవాలేదు. కాని నువ్వు అనవసరంగా గొంతుచించుకోకు."

"నాకు చాలా నేర్చుకోవాలని వుంది. అనుభవంలేదు." అంటూ బెరుగ్గా చేతులు నలుపుకున్నాడు. "నా నాటకం ఇదివరకు చూశారా ?"

"నీ నాటకం ?"

సత్యం సిగ్గుపడ్తూ, "లక్ష్మీ నాటకమండలివారి 'పడగపాము'లో నేనుకూడా వున్నా."

"అలాగా. చిన్నతనంలో యిల్లాంటి సరదాలు వుండాల్సిందే. నాకు అల్లాంటి పిల్లల్ని చూస్తే యిష్టం."

సత్యం ముఖం నవ్వుతో నిండిపోయింది. అసలు యీయనవచ్చిన కారణం ఏమిటి ? తనకు అదృష్టం తిరగలేదుకదా ? గాలిలో మేడలు లేస్తున్నాయ్.

"మీ చెల్లెల్ని చూద్దామని వచ్చాను. ముందే చెప్పుదా మనుకున్నా. కాని మాటల్లో పడిపోయాము."

తన చెల్లెల్ని చూసేందుకు ! చీపిరికళ్ళు, చిటపట్లాడే మొహం – రాధని చూసేందుకా !

"మీా చెల్లెలు చంపకాన్ని చూద్దామనివచ్చా."

సత్యం లోలోపల ఆ కారణంగా మండిపడ్డాడు. అతనికి తెలియకుండానే కటువుగా "మా చెల్లెలికి మీతో చనువుందని నాకు తెలియదే" అన్నాడు.

"అబ్బే, నాకా పిల్లతో చనువులేదు. నిన్న సాయంత్రం ప్రియంవద యింట్లో చూశాను."

"ఓహో – ఆ ముసలావిడా ! సంగీతం చెప్తుందిగదూ."

"ముసలావిడేంకాదు. నాకంటే పదిహేనేళ్ళు చిన్న. నాకు అర్థమైంది. నాకంత వయస్సుందని అనుకోవుకదూ ! శాస్త్ర కట్టుగా చెప్తుంది సంగీతం."

"అవును" అన్నాడు సత్యం హేళనగా. మనసులో ఈ మనిషిని బయటకు గెంటుదా మన్నంత కోపంగా వుంది. కాని చంపకాన్ని గూర్చి పూర్తిగా తెలుసుకోవాలి. తను భయ పడుతున్నది కాదుగదా.

ముసలాయన తన ధోరణిలో పోతున్నాడు. "ప్రియం వద చాలా బాగా పాడుతుంది. అంటే పెద్ద విద్వాంసురాలని కాదు. కాని కంఠంలో మాధుర్యం వుంది. అల్లాంటి మాధు ర్యమే చంపకం కంఠంలోనూ ఉంది. ఈ పిల్ల కూడా చక్కగా వుంటుంది." హీరాలాల్ నవ్వుతూ సత్యం చూపుల్ని వెతికాడు.

సత్యం మొహంలో వుత్సాహం లేదు.

"చంపకానికి పోషణ తక్కువ. చూపులకు అందంగా వున్నా మనసుకి తగినంత సంతోషం వున్నట్టు తోచదు. కుటుంబానికి వన్నె తెచ్చే పిల్ల. పుట్టుకలోనే అందచందాలను సొంతం చేసుకున్న అదృష్టవంతుల్లో చంపకం ఒకత్తె. అమ్మగారు యింట్లో వున్నారా? అసలు అమ్మగారితో చంపకం విషయమై మాట్లాడుదామని వచ్చాను."

"అమ్మకి వంట్లో బాగుండలేదు. పొద్దుణ్ణించి లేవలేదు. అసలు విషయం యేమిటి?" అని అడిగాడు సత్యం. ఈ వ్యవహారం తల్లి చేతుల్లో పడడటం సత్యానికి యిష్టం లేదు.

"అయితే నాకు అమ్మగార్ని చూట్టంపడదే. రేపు కలకత్తా వెళ్తున్నా. ఇప్పట్లో రాను. నా మనస్సులోవుంది చెప్తా. తరవాత అమ్మగార్కి విషయమిప్పి నువ్వు చెప్పు. చంపకంలాంటి పిల్లలకు నాలుగు పక్కలనుంచి అపాయాలుంటాయి. వాళ్ళ మనసు చాలా సున్నితంగా వుంటుంది. నిన్న సాయంత్రం చంపకాన్ని చూడగానే ఎంతో జాలేసింది. కొందర్ని చూస్తే ఎందుకో అలా అనిపిస్తుంది నాకు. ఆ పిల్ల ఆపదల్లో పడకుండా కాపాడా లనిపించింది."

లాల్‌జీ సత్యంవంక ప్రశ్నార్థకంగా చూశాడు. సత్యం నిట్టూర్పు విడిచాడు. ఈ పదిహేను నిముషాలలో అతని ఆశలు అంతరిక్షంలోకి ఎగిరి దభుక్కున నేలమీదవాలి మట్టిలో కలిశాయి. లాల్‌జీ పేరుమీద, మనిషిమీద, గౌరవం పటాపంచలయింది. ముసలాయన్ని ఎలాగైనా న్యూనత పర్చా లనిపించింది.

"ఇంటిదగ్గిర ఏ ప్రత్యేక అపాయాల్లో చిక్కుకుందో కొంచెం నాకు చెబుతారూ !" అన్నాడు పెస్పాట్గా—

"అసలీ యిల్లే ఆ పిల్లలోపు సెగుపు ఆ క్రిస్తుంది. ఆ అమ్మాయిని నాతో కలకత్తా తీసుకెళ్దామని వుంది."

ఆ మనిషి పిచ్చివాడని సత్యం మనసులో సరిపెట్టుకోవాలని చూశాడు—కాని ప్రయోజనం లేదు.

"మీరు రేపు కలకత్తా వెళ్తానంటున్నారు—చంపకంతో ముందే ఏర్పాటు చేసుకున్నారా ?"

"అబ్బే లేదు. రేపే అమ్మాయిని తీసుకెళ్ళాలను కాదు."

"ఇంటిదగ్గర బాగులేదని మీతో చెప్పిందా ?" సత్యానికి చంపకంమీద అసహ్యం కలుగుతోంది—

నేనూ, చంపకం అసలు మాట్లాడుకోనే లేదు – నన్ను అపార్థం చేసుకోకు. చంపకానికి ఇంట్లో అపాయాలున్నాయంటే మీరు ప్రేమతో చూడరనికాదు నా భావం—మీరు బీదవాళ్లు అవడం మీ తప్పుకాదు — చంపకం వృద్ధిలోకి రావడానికి మంచి వాతావరణం కావాలి – శుభ్రమయిన తిండి, చక్కటి బట్టలు, మనస్సుకు వుత్సాహమిచ్చే పరిసరాలూ కావాలి. ప్రపంచంలో అందమైన వస్తువుల్ని నిర్మూలించే శక్తులు చాలా వున్నాయి – దరిద్రం, డబ్బుమీద కాపీనం, మూర్ఖం, స్వార్థం, ఆత్మవిశ్వాసం లేకపోవడం – యివన్నీ చంపకానికి శత్రువులు మీ అమ్మా, నువ్వూ చంపకాన్ని ప్రేమతో చూడవచ్చు – కాని – చంపకంలాంటి పువ్వుని చీడ పురుగులు ఆవరించుకు వుండటం సహజం. చంపకంలాంటి

పిల్లలకి సూత్నావకాశాలు కల్పించడంకంటే నా కానంద మేముంటుంది? చంపకం చూపు నామనసును కదిలించి వేసింది. ఆమెకళ్ళు నీలిమబ్బుల్లా దీనంగా వున్నాయి." లాల్‌జీ కంఠం లోని దయ సత్యానికి అర్థం అవడం కష్టం. అందుచేత అత నన్నాడు "చంపకం కలకత్తాలో ఏంచేస్తుంది ?...సినిమాల్లో చేరిపిద్దామనా మీ వుద్దేశం ?"

"ప్రస్తుతం నా కేవుద్దేశమూ లేదు. నటికావచ్చు, నర్తకి కావచ్చు, విద్యాంసురాలు కావచ్చు. ఇవేమీ కాలేక పోయినా, ఎవరో ఒక యువకుడి ఆదర్శ గృహిణికాగలదు. చంపకానికి అందం, కంఠం, సౌజన్యం, అమాయికత ఉన్నాయి – అలాంటిపిల్ల ఏదయినా కావచ్చు. ఆ అమ్మాయి సహజంగా పెరిగేందుకు అవకాశమివ్వడమే నా కోర్కె. నేను ధనవంతుణ్ణి. నా డబ్బుతో చాలామందిని పైకి తీసుకొచ్చాను."

"స్త్రీలనా !"

"స్త్రీలనీ పురుషుల్నీ కూడా – ఆ తేడా చిన్నపిల్లలకిగాని నా కెందుకనిపిస్తుంది నాయనా. నా గురించి నీ కేమీ తెలిసి నట్టు లేదు. ఆమె సుఖంగా బతుకుతుంది. అంతకంటే మీ కేంకావాలి ?" సత్యం హృదయంలోంచి మురికివాసన గుప్పున పైకొచ్చింది. "మీ శ్రమకీ డబ్బుకీ ప్రతిఫలం ఏమిటి ?" అన్నాడు కఠినత కనిపించకుండా.

"నేను పడుతున్నది శ్రమకాదు. ఒకజీవి బాగుపడు తుందనే సంతోషం. నాకు కావలసిన దానికంటె డబ్బెక్కు వుంది" సత్యం కిందకి చూశాడు. ఏంమాట్లాడాలో తెలీడం లేదు.

"చంపకం పదిహేనురోజుల్లో కలకత్తా బయలుదేరాలని నాకోర్కె. మైలాపూర్‌లో శంకర్‌లాల్ బంగళా నీకు తెలుసుగా! నువ్వూ, అమ్మగారూ ఆలోచించుకొని చంపకాన్ని వాళ్ళింట్లో దిగబెడితే మిగతావన్నీ వారు చూసుకుంటారు. నేనీరాత్రి శంకర్‌లాల్ భార్యతో చంపకం విషయమై చెప్పి వెళ్తాను. మీరెప్పుడు వెళ్ళినాసరే – ఆమె సంతోషంగా మిమ్మల్ని రిసీవ్ చేసుకుంటుంది."

"మీరీ విషయమై చంపకంతో మాట్లాడనే లేదా?"

"లేదు. సంగీతం క్లాసులో ఎట్లామాట్లాడుతా?"

"ఒకవేళ చంపకం మీతో రానంటుందేమో! ఆ విషయం ఆలోచించారా?"

"అంత తెలివి తక్కువదా చంపకం! అమ్మాయి వస్తుందని అనుకుంటున్నా. జీవితంలోకి దూకి కష్టసుఖాలు అనుభవించడానికి వెనుదీయరు చంపకంలాంటి పిల్లలు. ఆమె స్వతంత్రంగా ముందుకు దూకుతుంది. కానీ, నువ్వుగానీ మా అమ్మగానీ ఆమె కాళ్ళకు బంధాలు తగిలిస్తే ఏమిచేస్తుంది?"

"అన్నయ్యా. తల్లీ యిలాంటి ప్రేమబంధాలుంటాయిగా!"

"ఉంటాయి. నేను చంపకాన్ని మీ సంబంధంనుంచి విడదీయడం లేదు. మీకు ఉత్తరాలు వ్రాస్తూంటుంది. అప్పుడప్పుడు వచ్చి చూస్తూంటుంది. చంపకాన్ని బీదరికంనుంచి తప్పించాలనే నా వాంఛ. చంపకం హాయిగా వుంటుందన్న ఆలోచన మీకు సుఖాన్ని యివ్వలేదూ?"

"తప్పకుండా. మా కష్టాలుకూడా కొంతవరకు తగ్గుతాయి."

"అవును. చంపకాన్ని మీరు 'మిస్' అవుతారు కొన్నాళ్ళపాటు. ఆపైన అలవాటవుతుంది."

"దాని కిప్పుడు యిరవయ్యేళ్ళు. మా నాన్న చిన్నప్పుడే పోయారు. దగ్గిర డబ్బేంలేదు. ఏమనుకోకండి బీదరికాన్ని చెప్తుంటే!"

"బీదరికం, బాగా డబ్బుండటం - ఒకవిధంగా అకస్మాత్తుగా కలిగేవే! చంపకానికి పదిహేడేళ్ళున్నాయా? ఉద్యోగం చేస్తోందట - తన చీరెలకయినా వస్తుందనా?"

"అవును" అన్నాడు సత్యం.

"చంపకం సంపాదన వున్నా లేకపోయినా మీకేం ఇబ్బంది వుండదనుకుంటా. ఇబ్బంది అయితే స్పష్టంగా చెప్పు. దానికి తగిన ఏర్పాటు చేస్తాను. చంపకంమీద బతుకుపోసేటంత చెడ్డవాడిలా లేవు నువ్వు. నీకు యిరవై ఎనిమిదేళ్ళుంటాయా? ఏం వుద్యోగంచేస్తున్నావ్?"

"నాకు యిరవై నాలుగోపడు. మార్వాడీ గుమస్తాగా వున్నా" సత్యానికి మనసులో చిన్నకాంతి కిరణం మెరిసింది. తన ప్రజ్ఞ ముసలాయన కనిపెట్టి నటకుడయేందుకు కొంచెం సాయంచేస్తేనా? తను అల్లుకుపోడూ! చంపకంలో ఏముంది? ఆడపిల్ల అనే ఆకర్షణలో పడ్డాడు ముసలాడు. మళ్ళీ ఒక్కసారి తననుగూర్చి ఆలోచిస్తాడేమో; తన తల్లి తనలో నటకుడయ్యే లక్షణాలున్నాయని ఎన్నోసార్లు అంది. తన అవకాశాన్ని ఈ

చంపకం దొంగలా దోచుకుంటోంది. చంపకానికి 'అసుగు జాడల్లో' కమల పాత్ర యిస్తే, తగలెయ్యదూ? ప్రేక్షకులు చెప్పులు విసురుతారు. "మా నాన్న పదేళ్ళక్రితం పోయారు. పొలం, ఇల్లూ అమ్మేసి పట్నం చేరుకున్నాము. ఈ విచారాల్లో నేను యింటర్ పూర్తిచెయ్యలేకపోయాను. ముగ్గురి చెల్లెళ్ళనీ అమ్మనీ పెట్టుకుని పొట్టకోసం పాకులాడుతున్నా నీ పెద్ద పట్నంలో." సత్యానికి అకస్మాత్తుగా తనమీద తనకే జాలి కలిగింది. తన నిస్సహాయస్థితిని అర్థంచేసుకోండి అన్నట్లు లాల్‌జీ కళ్ళలోకి చూశాడు.

"కుటుంబగౌరవం అలా కాపాడుకోవాలి."

సత్యం ముసలాడి దగ్గిరనుంచి పొగడ్తలు కాదు కోరింది. "యజమాని కరోర్కటకుడు. కాలేజీ రోజుల్నుంచీ కలలుకంటూ వుండేవాడిని. కాని నావన్నీ కలలు కావనుకుంటూ ...నేనూ."

"మాలిన్యంలేని మనసుతో పడే కష్టం వృథా కాదు."

"మొదట లాయర్‌ని అవుదామనుకున్నా. చదువుకు వెళ్ళాను. తీరా వెళ్ళేటప్పటికి నాకు కావలసింది ప్లీడరీ కాదని తెలిసింది. కాలేజీలో పిల్లలతో నేనూ కలలుగన్నాను" సత్యం సిగ్గుపడుతూ నవ్వి "కాలేజీ లోకమే నన్ను మార్చేసింది. కాలేజీ నాటక సమాజం మెంబర్ని నేను" అన్నాడు.

"లాల్‌జీ యీ మాటల అర్థం తెలుసుకోవాలని ప్రయత్నిస్తూ "అవును మంచిదే" అన్నాడు.

"నా కలలన్నీ మా నాన్న పోవడంతో కూలి పోయాయి. కాలేజీ వదిలివేయవలసి వచ్చింది."

"కాలేజీలు పిల్లల్ని చెడగొట్టేస్తాయ్. అందులో సామాన్య సంసారులు తట్టుకోలేరు."

"మీకేం; మీకు కావలసినంత ధనంవుంది. మాలాంటి బీదల కోర్కెలన్నీ అణిగిపోతాయి" సత్యానికి కావలసింది ఓదార్పు మాటలుకాదు.

లాల్‌జీ గడియారంవంక చూశాడు, "ఈ నెలాఖరు లోగా శంకర్‌లాల్ బంగళాకి మీ చెల్లెల్ని నువ్వుగాని, మీ అమ్మగారుగాని తీసుకువెళ్ళండి. పై నెల మొదటివారంలో శంకర్‌లాల్ ఢూటీ వెళ్ళిపోతాడు. మరి నేను వెళ్ళొస్తా, నే చెప్పినవన్నీ చెయ్యడానికి చెప్తావ్‌గా!"

సత్యం వొళ్ళు భగభగ మండిపోయింది. తన ప్రార్థన లన్నీ విని దిగిన దేవదూత తనకు కాకుండా చంపకం కోసం దేవులాడుతున్నాడు. సత్యం నిర్లక్ష్యంగా ఆయన మాటకు సమాధానం యివ్వలేదు.

ముసలాయన తెలియనట్టు నవ్వుతూ, సత్యం బుజం మీద చెయ్యి వేశాడు. సత్యం ఒక్కసారి వొణికాడు. రవి నాట్యమండలి ప్రొప్రయిటరు, తన కలల్లోని కథానాయకుడి చెయ్యి తన బుజంమీద—

వృద్ధుడు సత్యాన్ని దీవిస్తున్నట్టు దయగా చూశాడు. కాని సత్యాని కాయనకంటికాంతి తనను వెక్కిరించినట్టయింది.

౨

సత్యం తలుపు విసురుగా వేశాడు. గదిలోని మురికి బట్టలు, పగిలిన అద్దం, చిందరవందరగా వున్న పత్రికలూ ప్రతి

వస్తున్నా తన్ని వెక్కిరిస్తున్నాయ్. తల తిరుగుతోంది. యథా స్థానంలో కూలబడి, కాగితాలు చేతులోకి తీసుకున్నాడు. "ఆనాటి మల్లెచెట్టు నీడలో—" చాలా నెమ్మదిగా చదువుతున్నాడు. గొంతు పైకెత్తేందుకు భయపడ్తున్నాడు. ఇంట్లో వాళ్ళు తన అధికారాన్ని సహించలేకుండా వున్నారు. ముఖ్యంగా రాధా-చంపకం.

అమ్మని తల్చుకుంటే జాలివేసింది, కాని ఆమెనే తలుపు దగ్గిర చూసేటప్పటికి కోపం వచ్చింది.

"చీకటిగా వుంది-లైటు కావాలా? ఆ వచ్చినాయ నెవరూ?"

"ఏదో నాటకాన్ని గూర్చి మాట్లాడేందుకు వచ్చారు."

రత్నమ్మ గది వదలి వెళ్ళకుండా తచ్చాట్టం మొదలెట్టింది.

"అమ్మా-కొంచెం సేపన్నా నన్ను శాంతిగా వదల రాదూ? లైటు సంగతి నేను చూసుకుంటాలే. నా పోర్షను కంఠతా పట్టాలి."

"నీ వంట్లో బాగా లేదా, నాయనా?"

"నన్ను చంపుకు తింటున్నారు"

"అవేం మాటలురా" అంటూ తల్లి దగ్గిర కొచ్చింది.

"నాకో ఆపద వచ్చిందమ్మా. దాన్ని గురించి ఇప్పుడు మనం మాటాడకుండా వుంటే మంచిది. ఇంకెప్పుడూ బాధ పెట్టకు—"

రత్నమ్మ కొడుక్కి ఆఫీసులో ఏదో కష్టం వచ్చిందనుకుంది. తలుపుమూసి బయట కెళ్ళిం తరువాత నాటకం జ్ఞాపకం

వచ్చింది. సత్యానికి ఆఫీసుకంటె నాటకం ప్రాణంతో సమానం. ఆ వచ్చిన మనిషి సత్యాన్ని నాటకంలోంచి తీసేశారని చెప్పేందుకొచ్చాడేమో ? ఎవరైనా అసూయచేత సడగొట్టా రేమో—లేక కమల నాటకంలో వెయ్యడంలేదో, వంటింట్లో కెళ్ళి రాధని మళ్ళీ అడిగింది ఆ వచ్చినాయన్ని గురించి.

"నేను నా పరీక్ష గొడవలో వున్నా—ఆయన పేరు విన లేదు"

రత్నమ్మా పిల్లలూ ఆ వున్న కాసిని రొట్టెలూ భోంచే శారు. కొడుకు గదిలోకి వెళ్ళి "తొమ్మిదయింది పడుకోరా నాయనా" అంది రత్నమ్మ.

"నేనింకో గంటసేపు చదువుకుంటా, నువ్వు వెళ్ళి పడు కోమ్మా"

"సరేలే—చూడు – చంపకం వాళ్ళ సంగీతం పిల్లలతో కలసి ఏదో నాటకానికి వెళ్ళింది. దాని రొట్టెలు వంటింట్లో పళ్ళెంకింద వున్నాయని చెప్పు—తొమ్మిదయినా ఇంకా యింటికి రాలేదు. ఆ నాటకానికి మొగపిల్లలు రారూ ? ఇంకా ఆడ పిల్ల లుండరనికాదు – ఏమో కానిరోజులు" తల్లి వెళ్ళింది.

"మళ్ళీ పోర్షన్ చేతులో పట్టుకు "ఆనాడు మల్లెచెట్టు నీడలో. . ." అంటూ మొదలెట్టాడు సత్యం.

వీధి తలుపు చప్పుడయింది, చంపకం వచ్చింది.

"ఆలస్యం అయింది. అంతా పడుకున్నారా ?"

"అమ్మ యిప్పుడే పడుకుంది. వంటింట్లో పళ్ళెంకింద వున్నాయి రొట్టెలు. ఇక్కడికి తెచ్చుకో తిందువుగాని"

చంపకం పళ్ళెం, నీళ్ళు తెచ్చుకు సత్యానికి ఎదురుగా కూచుని "ఆరుగంటలనుంచి ఆకలి మండిపోతోంది" అంది సత్యంవంక చూస్తూ – సత్యం యింత దయగా తన గదిలో భోంచేయమనడం యిదే మొదటిసారి.

"మజ్జిగ లేదా?" అడిగాడు సత్యం.

"రాత్రిళ్ళు మజ్జిగ పోసుకుంటే కంఠం పోతుందని అమ్మ చెప్పింది. ఇవ్వాళ మధ్యాహ్నం మా ఆఫీసులో టీకి బదులు మజ్జిగ యిచ్చారు."

చంపకం కళ్ళు మెరుస్తున్నాయి. వొంటిరంగు దీప కాంతిలో మరీ పచ్చగా వుంది. జుట్టు నొక్కులుగా బుజం మీద పడ్తోంది. చెంపలు ధగధగలాడు తున్నాయి. కట్టుకున్నది పాతచీరైనా లైటువెలుగులో సత్యానికి చంపకం చాలా అందంగా కనిపించింది. తన చెల్లెలు అందగత్తె అని నమ్మేందుకే భయపడ్డాడు సత్యం. చంపకమే లాల్‌జీసి తననుంచి దొంగిలించింది.

పోగ్లాసు మడిచిపెట్టూ "ఇంత ఆలస్యమయిందేం" అని అడిగాడు.

"నాటకం చివరిదాకా వుండకపోతే బాగుండదు. మా స్నేహితురాలి అన్న మన యింటిదాకా సాయంవచ్చాడు."

"అక్కడ పిల్లలు రౌడీలు."

"అబ్బే—చాలా మర్యాదగా వుంటారు. నాటకానికి వెళ్ళకపోతే సంగీతం టీచరుకు కోపం వస్తుంది. ఇంతకంటే చవగ్గా మరే టీచరూ సంగీతం చెప్పదు. అయినా సాయంత్రం క్లాసు కాబట్టి నాకు తేలిక."

"సంగీతం నీకెందుకు పనికొస్తుంది? బస్ ఛార్జీలూ, ఆమె ఫీజూ అంతా వేస్ట్!" అని మృదువుగా అధికారం చెలాయించే ధోరణిలో అడిగాడు,

ఇద్దరూ ఒకరివంక ఒకరు దొంగల్లా చూసుకున్నారు. చంపకానికి తననిగురించి అన్నగారితో మాట్లాడటం అలవాటు లేదు. సత్యానికి చంపకాన్ని మాట్లాడించి, లాంగ్‌జీ గురించి ఆరా తియ్యాలని అభిప్రాయం.

"సంగీతం పొద్దుపోక కదూ!" అన్నాడు సత్యం.

"అవును. పొద్దున్న ఎనిమిదినుంచి సాయంత్రం ఆరు గంటలదాకా ఆ ఆఫీసులోపడి కొట్టుకోవాలి. పొద్దుట కూచున్న తరవాత మళ్ళీ వచ్చేదాకా ఆ కుర్చీలోంచి లేవడమంటూ వుండదు" అంటూ నిర్లక్ష్యంగా నవ్వింది.

"అల్లాంటప్పుడే చిన్నతనపు పనులు. అసలు నువ్వు నిదానస్తురాలివి, పుస్తకాలంటే ప్రీతి; నీ కిష్టమయిన ఉద్యోగం దొరికింది. చంపకం, ఎవరన్నా నువ్వు రచయిత్రివిగాని యింకా ఏమన్నా అవుతావని చెప్పారా?" సత్యం అన్నాడు. చంపకం సమాధానానికి ఎదురుచూస్తున్నాడు.

"ఎలాంటిదాన్నవుతానని?"

"మీ సంగీతం టీచరన్నా మరెవరన్నా నువ్వు సినిమా స్టార్ గాని, గాయకురాలుగాని అవుతావని అన్నారేమోనని."

చంపకానికి ఆశ్చర్యంగా వుంది. సత్యానికి తను ఎవరితో నన్నా మాట్లాడి యింటికొస్తే వాళ్ళసంభాషణలలోని హాంశా

లను ఉపయోగించడం అలవాటు. అంటే సత్యంతో ఎవరో మాట్లాడి వుండాలన్న మాట. బహుశా తననిగూర్చే నేమో !

"అంటే ?"

"నువ్వు అందంగా వుంటావు కదూ ! ఎవరన్నా మాటలతో ప్రోత్సాహం యిచ్చారేమోనని. మీ సంగీతం టీచరు చెప్పిందేమోనని."

"నేను బాగా పాడగలననికూడా అనుకోదావిడ. అయినా అంతమంది పిల్లల్లో నా ప్రత్యేకత ఏమిటి ?"

"పోనీలే–ఆ సంగతి వదిలేయ్. నీ మటుకు నీకు సినిమాల్లో చేరాలని వుందా ? నువ్వెప్పుడూ అలాంటివి ఆలోచించవు గదూ !" నెమ్మదిగా తప్పించ ప్రయత్నిస్తున్నాడు.

చంపకం మొహం కందిపోయింది. సత్యం తనని వేళాకోళం చేస్తున్నాడా ? సిగ్గుల్లోకి వెళ్తే కాళ్లూ చేతులూ వొణుకుతాయి. యాక్ట్ చెయ్యడం గూడానా ?

"నువ్వు అలాంటి అల్లగాజాతి కానందుకు సంతోషంగా వుంది. నువ్వు అర్థం చేసుకుంటావనీ అలాంటి పిచ్చి పిచ్చి ఆలోచనలు చెయ్యకుండా వుండేందుకూ నీతో యింతసేపూ మాట్లాడాను. చూడు. నువ్వు పెద్దదానివి అవుతున్నావ్– అమ్మ మన సంసారంగురించి దిగులుపడుతోంది. ఈ చాలీ చాలని డబ్బుతో పట్నం కాపురం కష్టంగా వుంది. ఆ సంగీతం క్లాసు– అవీ మానేయడం మంచిది కదూ ?"

"నాను మానెయ్యాలని లేదు" చంపకం కటువుగా జవాబిచ్చింది.

(ఇ)

"ఒక్కొక్కప్పుడు మనం మన కోర్కెలని చంపుకొని ఇతరుల కష్టాలు తీర్చవలసివస్తుంది. అమ్మ మన అప్పుగురించి భయపడ్తోంది. మన సంపాదన పెరుగుతే అప్పు తీర్చేయవచ్చు. ఈ లోపల రాధ పరీక్షలైపోతాయి. స్కూలు టీచరయి, దాని పొట్ట అది పోసుకుంటుంది. మనం కష్టంగా గడుపుకోవాలి. ఇంకో నెల పోయింతరవాత మీ ఎడిటర్ని పదిరూపాయలు ఇంక్రిమెంట్ అడుగు."

చంపకానికి మాటలు తోచలేదు.

"నిన్ను కష్టపెడ్దామని, కోపంచేద్దామని నా వుద్దేశం కాదు. ఎన్ని సంగతులు మాట్లాడినా, ఎంత సంపాయించినా మన సంసారానికేగా; మరెవరికోసం కాదుగా! ఇంట్లో తిండికి కరువైతే, నువ్వు సంగీతానికి, నవలలకీ ఖర్చుపెట్టే హక్కు నీకుందా లేదా అనే ప్రశ్న నిన్ను నువ్వే వేసుకో."

"నా సంగీతానికీ పుస్తకాలకీ కలిసి నెలకి ఎనిమిదిరూపాయలవుతాయి. నీ సాదరుకీ, నాటకం, క్లబ్బుకీ పదిహేను రూపాయలు అవుతున్నాయి."

సత్యానికి కోపంవచ్చింది. "నేను నిన్ను ఆజ్ఞపెట్టడం లేదు. నేనూ యీ నెలనుంచి ఎనిమిదే ఖర్చుపెడ్తాను. నాటక సంఘంలో రాజీనామా యిస్తాను. ఈ నాటకం అయిన తరువాత అటు పక్కకే వెళ్ళను. ఇంక నాటకాలగొడవ ఎత్తను."

"నాటకాలు నీకు యిష్టంగా!"

"అయినాసరే నాటకాలు మాన్తాను. నాటకాలే కాదు— యింకోటికూడా మానేస్తాను. నేను ఎవరికీ చెప్పని విషయం అది."

"అంటే ?" చంపకానికి కొంచెం అర్థం అవుతోంది.

"చాలామంది పెళ్ళిచేసుకునేందుకు వీలుండదు."

చంపకానికి ప్రేమ వ్యవహారాలు తెలియవు. అన్న గారితో యిలాంటిమాటలు మాట్లాడకుండా తప్పించుకుందా మని ప్రయత్నిస్తోంది.

"నేను ఒకరిని ప్రేమిస్తున్నా. ఆమె నన్ను ప్రేమిస్తోంది. కాని ఆ వ్యవహారం ఇంక కట్టిపెట్టాలి."

"ఎందుకన్నయ్యా అలాచేయడం? దానికీ దీనికీ సంబంధం ఏమిటి ?" పుస్తకాల్లోని ప్రేమికుల బాధలు తలచుకు అన్న గార్ని చూసి జాలిపడుతోంది చంపకం.

"నువ్వు చిన్నదానివి— ప్రేమ, ఆపైన పెళ్ళి, భార్యా పిల్లలూ. నా సంసారం పెరుగుతే మీ పనేంగానూ ? మన కుటుంబంకోసం నేను పెళ్లి మానేస్తాను; నేను నాకున్న ఆనంద మంతా కుటుంబ సౌఖ్యంకోసం ధారపోస్తాను. ఆ పైన నీ యిష్టం."

"ఈ త్యాగాలకు లొంగకు" అని చంపకం ఆత్మ ఘోషి స్తున్నా, అన్నమీాద జాలి, రక్తస్పర్శవల్లవుండే బంధనా గెలి చాయి. చంపకం తను సంగీతపాఠాలు మానేస్తానని వొప్పు కుంది.

౬

జరిగిన విషయాలు తల్లికి చెప్పకుండావుందామను కున్నాడు సత్యం. కాని లోకంలో నెగ్గుకు రాలేకపోయినా, కుటుంబంలోనన్నా తనను పెద్దచేసి తన అధికారం చెలాయించ

నిస్తుంది తల్లి. మొదటినుంచీ తల్లి సత్యంపక్షం. అతనిలో అహంకారానికామె దోహదం యిచ్చింది. రత్నమ్మ జీవితంలో రెండువంతులు గడిచిపోయాయి. ఇంకొక్కవంతే మిగిలింది. ఇంతకాలం సత్యం పెద్దవాడవుతాడన్న ఆమె అభిలాష అతనిలో లేని శక్తిని కల్పించుకోనిచ్చింది. కొడుకేనాడో గొప్ప నటకుడూ, ధనవంతుడూ కాగలడని ఆమె నమ్మకం. ఈ నాడు చంపకంలో గొప్పతనం వుందంటే ఆమె నమ్మలేదు. ఏ లాల్‌జీయో చంపకాన్ని వృద్ధిలోకి తీసుకొస్తానంటే ఆమె వప్పుకోదు. సత్యంగురించి తలపోసిన కలలు విఫలమై, అవే చంపకానికి నిజమైతే తల్లికూడా భరించలేదు.

లాల్‌జీ చంపకాన్నిగురించి చెప్పిన ప్రతిదీ వున్నదున్నట్లు తల్లికి చెప్పడు-సత్యంలాంటి మనిషి. లాల్‌జీ ప్రియం వద టీచర్ పిల్లల్లోని ఒక పిల్లను తనతో తీసుకెళ్దామనుకున్నాడుట-ఛాన్సునల్ల చంపకాన్ని తీసుకెళదామని, చంపకం ఖర్చు తనే భరించి ట్రయినింగిస్తాడు. ఎన్నాళ్ళు ఎంతజీతం అనేది సరిగా విడమర్చి చెప్పలేదు. చంపకాన్ని డాన్సర్ చేస్తాడు. చంపకం యీడుకు డాన్సునేర్చుకుంటూరా ఎవరైనా? డబ్బంటే లేదుగాని గౌరవంగూడా మంటగలిసిందా తమ కుటుంబానికి! మొత్తంమీద లాల్‌జీ సూచనలలో అపశృతి వుంది. ఆయన స్నేహితురాలి దగ్గిరకు చంపకాన్ని పంపుతే ఆవిడ కలకత్తా తీసుకెళ్ళి విగబెడుతుంది. ఖర్చులన్నీ లాల్‌జీ భరిస్తాడు. మొత్తంమీద ఏమనుకోవాలి!

అంతా విని, "చంపకం బతుకు బాడలయిపోదూ, డాన్సులు మనకెందుకూ?" అంది రత్నమ్మ.

"ఆయన చెప్పిన స్నేహితులు రాలుకూడా అంత మర్యాదస్తురాలు కాదు. ఆయనమటుకు బాగా డబ్బున్నవాడు."

"నాకేం నచ్చలేదబ్బాయ్. చంపకాన్ని తీసుకుని ఆవిడ దగ్గిరకు నే నెళ్ళడం ఏమిటి? ఆయన చంపకాన్ని దేనికి మెచ్చుకున్నట్టు. దానిలో ఏమంత విశేషప్రజ్ఞ ఉంది?"

"చంపకం తారన్నా, గొప్ప సంగీతవిద్వాంసురాలన్నా, లేకపోతే గొప్ప డాన్సరన్నా అవుతుందిట" అన్నాడు సత్యం తల్లితో.

"అటే నాటకాలు వెయ్యగలదురా? అయినా నీ ఉద్దేశం?"

"నాకు తెలియదమ్మా—నీ యిష్టం."

"నాటకాలగురించి నీకు తెలీకపోవడమేం! చంపకం కమలలా దూసుకుపోలేదు. మన పిల్లకి ప్రపంచజ్ఞానం శూన్యం. అది పత్రికాఫీసులో పనిచేస్తే మన పనేమిటి? నీ సంపాదన మన సంసారానికి సరిపడుతుందా? చంపకం డబ్బులేకుండా మనకి గడవదు." ఆవిడ కంఠం వణికింది. "నిజంగా ఆయన చెప్పింది నిజమే అయి మనపిల్లను జాగ్రత్తగా చూసి ట్రయినింగు యిస్తాడే అనుకో. పిల్ల మనకి కాకుండా అయిపోతుంది. ఈ కుటుంబ చక్రం నీ ఒక్కడి రెక్కలమీద తిరుగుతుందా? అంత యిష్టంవున్నవాడు మన పిల్లను పెళ్లి చేసుకోకూడదూ? మన కష్టాలన్నీ తీరతాయి."

సత్యం యికిలించాడు. "చంపకాన్ని అతను ఆజ్ఞల్లో పెట్టడుట. దానికి యిష్టమైనప్పుడు ఎవరినైనాసరే పెళ్ళాడవచ్చునట."

కళ్ళల్లోకి చూసుకున్నారు యిద్దరూ. తల్లి తనను ఎదిరించదని సత్యానికి తెలుసు. తనతో గూడుపుఠాణి చేస్తుందని ధైర్యం.

"నేను భయపడుతూనే ఉన్నా, చంపకం ఎవరినన్నా పెళ్ళిచేసుకుంటుందేమోనని. అది సుఖంగా ఉండటం మనకి సంతోషమే కాని మననుంచి అది విడిపోతే యీ సంసారమంతా నీమీద విరుచుకుపడుతుంది. ఈ బరువంతా నువ్వు మొయ్యలేవురా నాయనా."

"నే నీ బరువు మొయ్యలేకుండా వున్నానమ్మా" అన్నాడు సత్యం.

"నాకు తెలుసు నీ కష్టం. రాత్రిళ్ళు నిన్ను తల్చుకు ఏడుస్తూవుంటాను. నీ ప్లీడరీ పూర్తికాకుండా ఆయన పోయారు. మేము గుదిబండల్లా నీ తలకు చుట్టుకున్నాం" కొడుకు తల రెండుచేతులతో నిమిరింది.

"నువ్వు విచారించకమ్మా. రాధ దాని పొట్ట అది పోసుకుంటుంది. ఇందు యింట్లో నీకు సాయంచేస్తుంది. నేనూ చంపకం నీకు సాయం చేస్తాం. పెద్దపెద్ద ఆశలకుపోయి చంపకం తన వుద్యోగం మానెయ్యకుండా చూడటమే మనపని."

"దానికి యీ నాటకాలు, యీ డాన్సులూ యివన్నీ ఎందుకు ? కడుపులోచల్ల కదలకుండా వుండనీ! ఈ అవకాశం నీకు వచ్చి వుండాల్సింది. ఎలాగో కష్టపడి వుందుం. ఇన్ని రోజులనుంచి కష్టపడింది నువ్వు. చంపకం నటించడమూ, అది తెరమీద తైతక్కలాడటమూ ?" అవిడ కంఠంలో హేళన వినవస్తోంది.

"మనం అలా అనుకోకూడదు" తల్లి బయటపడిపోవడం చూసి సత్యం సిగ్గుపడ్డాడు. "చంపకానికి మంచి చేయడమే మన వుద్దేశం. చంపకం గొప్పదయేందుకు మనం త్యాగం చేసినా ఫరవాలేదు."

"అదెప్పుడూ గొప్పది కాలేదు ఎలా అవుతుంది? దానికి ప్రపంచ జ్ఞానం ఏంతెలుసు? నువ్వందరికోసం త్యాగం చేస్తానంటావ్. దానినడకలో నాకు నమ్మకంలేదు. ఇలాంటిది గడపదాటితే మనకు దక్కుతుందీ?"

చంపకం అప్పుడే ఇంటికి వచ్చింది. రాధకీ చంపకానికీ ఒకే మంచం. ఇందుకే తల్లికీ ఒక మంచం. చంపకం ఆఫీసునుంచి వచ్చేటప్పుడు పేపరు కొనుక్కొచ్చింది. చంపకం చెయ్య లేని పొదుపుల్లో పేపరు కొనడం ఒకటి. పేపరు పేజీలు తిప్పు తూంటే "ప్రియంవద అనే గాయకురాలు గుండె జబ్బుతో నిన్న పొద్దున్న చనిపోయింది" అని కనపడింది. తన టీచరు ప్రియంవదకీ తనకీ ఋణం తీరిపోయింది. చంపకం ఎంతో పరిత పించింది. తను సంగీతం మానకుండానే ప్రియంవద మరణించింది. నిస్సహాయమైన కన్నీళ్ళు చంపకానివి.

పక్కగదిలో సత్యం, తల్లీ చంపకానికి లాల్‌జీ సంగతి చెప్పకుండా ఉండటం మంచిదను నిర్ధారణకొచ్చారు.

అదృష్టదేవత చంపకం గుమ్మం దగ్గరకొచ్చి తలుపు కొట్టింది. చంపకం ఆ పిలుపు వినలేదు. చంపకం మనసులోని వెర్రీ, ఆరాటం అలాగే కప్పడిపోయాయి.

అవకాశం నిశ్శబ్దంగా జారిపోయింది.

సాయంత్రం నాలుగయింది. చంపకం, యజమాని రంగనాథం తోటలో టీ తాగుతున్నారు. ఆనాడు రంగనాథం గారింటికి చాలామంది స్నేహితులూ, చుట్టాలూ వచ్చారు. మొగవాళ్లు టెన్నిస్ కోర్టుదగ్గర వున్నారు. రంగనాథం భార్యా, కూతురు, కోడలూ, కోడలు స్నేహితురాలూ కూర్చుని వున్నారు. రంగనాథం భార్య పక్కన చంపకం కూర్చుంది.

రంగనాథం కోడలు చంపకం గోళ్ళవంక అదేపనిగా చూస్తోంది. "గోళ్ళకి పాలిష్‌గాని వేశావా మెరుస్తున్నాయ్" అని అడిగింది చంపకాన్ని.

"లేదండి, అట్లాంటివి నేనేం కొనగలను?" నాలుక కొరుక్కుంది. యజమాని తక్కువజీతం ఇస్తున్నాడని తన పిర్యాదుగా వారు భావిస్తారేమో! "రోజూ స్నానానికిముందు గోళ్ళకి చమురు బాగా పట్టిస్తా అంతే."

"ఈ చీరెంత?"

"ఆరుంబావలా"

"ఇంత చవగ్గా అంత అందమయిన చీరెల్లా సంపాయించావమ్మా. కట్టూ బొట్టూ నీదగ్గరే నేర్చుకోవాలి. నీ ముఖంగూడా ఎప్పుడూ నిగనిగలాడుతూ వుంటుంది. ఏం స్నో వాడ్తావ్?"

"మొన్న నీ మధ్య 'అందానికి సాధనాలు' అను పుస్తకం చదివాను. వొంటికి శుభ్రంగా కొబ్బరినూనె రాసుకుని, పెసర పిండితో రుద్దుకుంటే మొహం చాలా నునుపుగా వుంటుందట.

నేనూ అదే చేస్తున్నాను. కొన్నాళ్లు పోయాక నేనూ ఒక పుస్తకం రాస్తాను."

చంపకం వాళ్లందరితో ఫ్రీగా మాట్లాడలేక పోయింది. వాళ్ళంతా ధైర్యంగా వుత్సాహంగా మాట్లాడుతారు. అన్నీ వింటూ కూచుంది–చంపకం ఈ మధ్య మరో పత్రికలో రాస్తూ యింకో పదిహేనూ యిరవై అదనం సంపాయిస్తోంది. నాలు గైదు మంచి చీరెలు కొనుక్కుంది.

రంగనాథం ఆడవాళ్ళ దగ్గిరకొచ్చాడు. "చంపకం మొహమాటస్తురాలు, సిగ్గుపడవద్దను" అన్నాడు భార్యతో. ఇంతలో మోటారుసైకిల్ శబ్దం వినపడింది. రంగనాథం భార్య; "రాజారావ్ వచ్చాడల్లేవుందే" అంది. ఆడా మొగా అంతా ఆ వచ్చినబ్బాయికి ఎదురు వెళ్ళారు. ఇందరి ఆహ్వానాన్ని అందుకొనే ఆ గొప్పవా డెవరా అని చంపకం తిరిగిచూసింది.

మనిషి చామన చాయగా వున్నాడు– మంచి పొడగరి. కళ్లు పెద్దవిగా నవ్వుతూ వున్నాయి. సిల్కుషర్టు, వులెన్ పాంటూ వేసుకున్నాడు. చంపకం అతన్ని ఒకటి రెండుసార్లు ఆఫీసులో చూసింది. అతను మొగాళ్ళదగ్గిర టీ తాగి టెన్నిస్ ఆడుతున్నాడు.

రంగనాథం భార్య చంపకం పక్కకుర్చీలో చతికిల బడింది. "అతన్ని నువ్వెప్పుడూ చూడలేదూ? మా పెద్ద వాడికీ రాజారావుకీ ప్రాణస్నేహం" అంది.

"ఏం చేస్తూంటారు?" అంది చంపకం పరధ్యానంగా.

"బి. ఎ. పాసయాడు. తల్లీ తండ్రీ లేరు. మేనమామే పెంచాడు. ఆస్తి వ్యవహారాలన్నీ ఆయనే చూస్తూంటాడు.

దక్షిణాన మంచి ఎస్టేటువుంది. కాఫీ తోటలమీదే వాళ్ళ కొస్తుంది బోలెడంత – అబ్బాయిని కాఫీ బిజినెస్‌లో పెడ్తాట్ట వాళ్ళ మేనమామ."

టెన్నిస్ బాలు దొర్లి చంపకం కుర్చీకింద కొచ్చింది—రాజారావు పరుగెత్తుకుంటూ వచ్చాడు. 'ఎక్స్‌క్యూజ్ మి' అంటూ వంగి కుర్చీకింద బంతి తీసుకుంటూ చంపకం వంక చూశాడు.

* * * *

సత్యంవాళ్ళు ఇప్పుడు అయిదు గదులున్న యింట్లోకి మారారు. మేడమీద రెండుగదులూ, కింద రెండుగదులూ, హాలూ. రాధ తను చదువుకున్న స్కూల్లోనే టీచరుగా చేరింది. వుండటంగూడా స్కూల్లోనే.శెలవలకు ఇంటికొస్తూంటేది. తన సంపాదనలో కానీకూడా ఇంటికిచ్చేదికాదు. తల్లికి ఇంటి పనుల్లో పూర్వంలాగే సాయం చేస్తోంది ఇందు. సత్యం పెళ్ళి కమలతో నిశ్చయం అయింది. చంపకానికి తను పెళ్ళిచేసుకోనని చెప్పిన తర్వాత నాలుగు నెలలు గడవక పూర్వమే సత్యం పెళ్ళి స్థిరం అయింది. సత్యం ఏదన్నా వుద్యోగంలో ఆరు నెల్లన్నా అంటిపెట్టుకు ఉండనిదే పిల్లనివ్వనన్నాడు కమల తండ్రి గంగయ్య. సత్యం నాటక సమాజంనుంచి విరమించుకో లేక పోయాడు. మార్వాడీ దగ్గరనుంచి ప్లీడరు గుమాస్తా అయాడు. ఆ వుద్యోగం తనకాబోయే అల్లుడికి తగదని ఖీమా ఏజంటుగా ప్రవేశపెట్టాడు గంగయ్య.

ఒక వుద్యోగంపోయి మరో వుద్యోగం దొరికేలోపల, ఖాళీవున్న రోజుల్లో సత్యం నాటక సమాజానికి మరీమరీ వెళ్తూండేవాడు. తను కృషిచేసి ఏనాడన్నా పేరుబడ్డ నటుణ్ణి కాకబోతానా అన్న ఆశ దినదినం ప్రబలమవుతోంది సత్యానికి. ఒకసారి ఎవరో నాటకంలోకి మనుషుల్ని తీసుకుంటారని విని సత్యం ఆ పెద్దమనిషిని కలుసుకున్నాడు. ఆయన పాటలు పాడేవాళ్లే తనకు కావాలని సత్యాన్ని తీసుకోలేదు. సత్యం ఆ వేడిలో చంపకం దగ్గిర అప్పుచేసి పాటలు నేర్చుకోడం మొదలెట్టాడు. ఆరునెల్లు పోయింతరువాత ఆయన దగ్గరకు వెళ్ళి పాడి వినిపించాడు. ఆయన పాట బాగానే వుందిగాని తమ సమాజంలోని పాటలు పాడేవాళ్ళ పోస్టు ఖాళీగా లేదు; అంతగా కావాలంటే పోస్టుమాన్ వేషం యిస్తానన్నాడు. సత్యానికి వళ్ళుమండి ఆ వేషం నిరాకరించాడు. మరోసారి వుద్యోగంలేక ఇంటిదగ్గిర కూచున్నప్పుడు పక్కంటి గుమాస్తా, వాళ్ళ చుట్టాల దొక నాటక కంపెనీ వుందన్నాడు. సత్యం అతన్ని వెంటబెట్టుకొని కాళ్ళు అరిగేటట్టు తిరిగాడు. వాళ్ళ నాటకం చూసేందుకు పాతికమంది వొప్పుకున్నారుట. ముందు నటకులు హాలుఅద్దె, ఖర్చులు భాగాల చొప్పున పంచుకుంటే నాటకం ఆడవచ్చునట. మొదటి నాటకం బాగుంటే వూళ్లో వాళ్లు టిక్కెట్టు కొనుక్కునన్నా రెండోసారి నాటకం చూస్తారట.

సత్యం ఇంటికొచ్చి తనవంతు ఏడు రూపాయలు చంపకం దగ్గిర బదులు తీసుకొన్నాడు. తీరా డబ్బు తీసుకున్న తరవాత "మా వాళ్ళు వుత్త పల్లెటూరి మొహాలు — నాటకం అక్కర్లేదంటున్నారు. అందుచేత ఆడటం విరమించుకున్నాం."

అని ఆయన బయటపెట్టాడు. ఆ రాత్రి సత్యం యీ సంగతంతా చంపకం దగ్గిరచెప్పి కళ్ళనీళ్ళ పర్యంతం అయాడు. సత్యం యీ నాటకాల పిచ్చిలోబడి అభిమాన రాహిత్యుడవటం చూసి చంపకం చాలా జాలిపడింది. తిరిగి డబ్బు కూడా అడగలేదు. అడిగినా ఎక్కడనుంచి ఇస్తాడు?

సత్యం నాటకాల పిచ్చివల్ల ఏ వుద్యోగంలోనూ నిలదొక్కుకోవడంలేదని కమలకి కష్టంగా వుంది. ఆమె అన్నట్టు సత్యాన్ని నటకావతంసుడని హేళన చేసేవారు. గంగయ్య "కాణీటికాణా లేనివాళ్ళు కూడా ఎల్లాగో అల్లాగ అర్జించుకుంటున్నారు. సత్యం, చివరకు కిరాణా కొట్టన్నా పెట్టకూడదూ!" అనేవాడు.

కమలకి ప్రధానం అయి మూడేళ్లు గడిచినా, పెళ్ళి కాకపోవడం ఆమె అన్నగార్లకి నచ్చలేదు. గంగయ్యకి సత్యం తల్లీ చెల్లెళ్ళతో కలిసి వుండటం యిష్టంలేదు. "చివరి పిల్లలు ఎల్లాగా సంపాదించుకుంటూనే వున్నారు. పెద్దపిల్లకు పెళ్ళి అవడం కష్టం. ఎంతమంది వెధవవాళ్లు వంటలక్కలయి బతకడం లేదు? ఎక్కడన్నా వంటచేసుకొని పెద్దపిల్లని పోషించుకోకూడదూ? నీ సంగతి నేను చూసుకుంటానుగా" అని అన్నాడు, గంగయ్య సత్యంతో. సత్యానికి తల్లిని అలా అనేటప్పటికి కోపం వచ్చింది. కాని కమలమీద ప్రేమ-గంగయ్య డబ్బుమీద మమకారం. అంచేత పైకి పొక్కకుండా లోపలే అణచుకున్నాడు తన కోపాన్ని సత్యం.

రాధకి కమలంటే పడేదికాదు- సత్యం దగ్గిర మటుకు తనకెందుకని మనసులో మాట బయటపెట్టేదికాదు. ఇందు

రత్నమ్మకి మూడుమూర్తులా కూతురు. అన్నగారంటే వెర్రి యిష్టం. అంచేత కమలనన్నా యిష్టమే, పైగా "కమలకి నా మీద చాలా ప్రేమ" అని అందరితోనూ వాగేది. చంపకం కమలకి తనమీద ఈర్ష్య అని గ్రహించుకోలేకపోయేది. సత్యం మూడేళ్లనుంచి పెళ్ళిచేసుకోలేక పోయినందుకు జాలిపడేది. "కమల అందగత్తె కాకపోయినా సత్యం ఎందుకంత పాకులాడుతాడా!" అని అనుకునేది. కమల అన్నగార్లను చూస్తే చంపకానికి గిట్టదు కాని కమలతో మర్యాదగా ప్రవర్తించేది–చంప కానికి ఏమిటంగురించి ఆలోచించవలసిందేమీ లేదు. అన్నకి కాబోయే భార్య.

ఆఫీసులో తనబావమరదినికూడా పెట్టాడు రంగనాథం–చంపకం అతనితోకూడా చక్కగా సర్దుకుపోయేది. తాతల నాటి పత్రికలన్నీ తెచ్చి కట్టలు కట్టలు పడేస్తూండే వాడతను. పాతపురాణాలన్నీ చంపకం దగ్గిర చేరేవి. వాటిల్లో వీటిల్లో తలోముక్కా ఏరి పత్రికకు మేటర్ తయారుచేసేది చంపకం.

స్త్రీల పేజీ, పిండివంటలు చేయడం యిత్యాది విష యాలు మారుపేర్లతో రాసేది. కథలకి 'అనూరాధ' అని పేరు పెట్టుకునేది. కొత్తగా ఆలోచించి కథలు రాయడంకంటె పాతవాటికే మెరుగుదిద్ది ప్రచురించేది.

చంపకం ఆర్జన పెరిగినకొద్దీ సంసార భారం కూడా పెరగడం మొదలెట్టింది. సత్యం యింటి ఖర్చుకు డబ్బు ఆనాటి కానాడు తగ్గించి యిస్తూండేవాడు. అతని సంపాదన కమలని సినిమాలకీ షికార్లకీ తీసుకెళ్ళేందుకే చాలేది కాదు. అప్పు

డప్పుడు కమలకి బహుమతులేమన్నా యివ్వాలిసొస్తే చంపకం దగ్గిర అయిదూ పదీ అప్పుచేసేవాడు.

ఇల్లు మారడంతో ఇంట్లో సామానూ మారుతుంది. రంగనాథం కొత్త సోఫాసెట్టు కొంటున్నప్పుడు ఒక టేబులూ, రెండు సాధారణ కుర్చీలూ ఒక వాలుకుర్చీ చంపకానికి యిచ్చాడు. ఆ టేబుల్ మీదకు టేబుల్ క్లాత్, ప్లవర్ వాజ్ వగైరా కొనితెస్తే ఇంట్లో సంతోషిస్తారనుకునేది చంపకం. తనెంతో ముచ్చటపడి ఏ గాజుగ్లాసులో కొని తీసుకురాగానే, యింటిదగ్గిర తల్లి, డొంకతిరుగుడు ప్రశ్నలువేసి కష్టంగా మాటలనేది. రాధ ముందు బాగున్నాయన్నా, తరవాత యింత ఖరీదు చేయవు, అనేది. “అల్లాంటివాటికి డబ్బు తగలెయ్యడమెందుకు ? ఇందుకు ఒక్క చీరన్నా లేదు” అనేది రత్నమ్మ. చంపకం మనసు చివుక్కుమనేది. మొదట్లో తనలో తను ఏడ్చేది. తర్వాత తల్లితిట్లు అలవాటైపోయాయి. రత్నమ్మకి సత్యం పెళ్ళి యిన్నాళ్ళు ఆగిపోవడం కష్టంగావుంది. కొడుకు తల్లికి క్రమంగా దూరం అవుతున్నాడు. కొడుకు పెళ్ళి కాకపోవడానికి తమ సంసారం కారణమేమోనని బాధపడేది. ఇలాంటి దిగుళ్ళన్నిటితో ఆడపిల్లలమీద అధికారం చెలాయించడం ఎక్కువయింది రత్నమ్మకి. మధ్యమధ్య యిల్లువదిలి పెళ్ళిపోతానని బెదిరించేది.

ఒకనాడు యిందుతో “నేను పోకముందే చంపకానికి యిల్లంతా చక్కపెట్టుకోవాలని వుంది కాబోలు” అన్నది రత్నమ్మ.

తల్లి పలుకులు చిలకలా పలికే యిందు ఒకరోజు "అమ్మకు ఇల్లు చక్కపెట్టడం చేతకా దనుకుంటున్నావా? ఇల్లంతా నీ ఆజ్ఞ లోకి తేవాలనా?" అంది చంపకంతో.

చంపకం తెల్లపోయింది. ఏడుస్తూ మంచంమీద పడింది. తన మొహం గోడ అద్దంలోంచి పాలిపోయినట్టు కన బడింది. తన జీవితంలోని ఒక్కొక్క ఘట్టం అద్దంలో కనబడ్తు న్నాయి. పెద్ద గాయకురా లవుదామని, మెరుపు తీగెలా మెరు ద్దామనీ కలలు కనేది. ఈ మురికి, దారిద్ర్యం ఆమె తపనికి ఫలితం. చంపకంలోని చిలిపితనం ప్రియంవదతోనే చచ్చి పోయింది. రెండో స్థితిలోని చంపకానికి విధ్యుక్తధర్మం, ఆత్మ త్యాగం వీటిలోనే సంతృప్తి. కష్టపడి సంపాదించి, యింటికి ఖర్చు పెడ్తున్నానని సంతోషించేది. ఇంట్లోవాళ్ళని సుఖపెడ్దా మనే ఆమె ప్రయత్నానికి ఫలితం హేళన, నిర్లక్ష్యం. అక్క చెల్లెళ్ళకూ తల్లికీ చిన్న చిన్న బహుమతు లివ్వడంలో తను సంతోషపడేది. ఈ రెండో చంపకం తనకు ఓర్పూ శక్తీ ఇచ్చి ఇంట్లోవాళ్ళకు సంతోషంగూర్చే యంత్రంలా తయారు చేయమని దేవుణ్ణి ప్రార్థించేది. తనకు సహనం యిమ్మని పరమాత్ముణ్ణి కోరేది. భక్తంటే తెలీని చంపకం తను ధర్మ మార్గం తప్పకుండా వుండేపాటి శక్తినివ్వమని ప్రార్థించేది. మనశ్శాంతికై చంపకం భగవద్గీత, పూర్ణపురుషుల జీవితాలూ చదివేది. ఏదో ఆధ్యాత్మిక శాంతికోసం ఆమె హృదయం ఆరాట పడేది. చంపకం ఒంటిగా గదిలో కూచుని ప్రార్థి స్తూంటే యింట్లోవాళ్ళు దొంగవేషం అనుకునేవారు. లైబ్రరీకి వెళ్ళి ఆలస్యంగా వస్తూవుంటే రత్నమ్మ అనుమానంగా

చూసేది కూతుర్ని. ఇందు గనక చంపకం భగవద్గీతని బయ టకు లాగకపోతే వాళ్ళ కుటుంబం చంపకానికి వైరాగ్యచింతన వుందనికూడా అనుకునేవారు కాదు.

చంపకానికీ రాధకీ ఒకే అల్మారా వుంది. ఇద్దరూ చెరో వైపూ పుస్తకాలు పెట్టుకుంటూంటారు. ఇందుకి ఇతరుల గదులు, పెట్టెలు వెతకడం సహజగుణం. సత్యం గదిలో కమల ఉత్తరాలు దొరుకుతాయేమోనని రహస్యంగా వెతుకుతూం డేది రత్నమ్మ. అప్పటినుంచి ఇందుచేతికి అడ్డంలేదు. ఇందు పిచ్చిమొద్దులా తల్లిదగ్గరకొచ్చి "చంపకం తలకింద పెట్టుకుసేం దుకా యీ పుస్తకం తెచ్చుకుంది" అంది.

తల్లీ కొడుకూ ఏదో రహస్యాలోచనలో వున్నారు. పుస్తకంచూసి సత్యం "యిదో పైత్యం కూడానా ?" అన్నాడు.

"నిజంగా చంపకం వైరాగ్యంలో పడిపోతే మన పనేం గాను! అందులో యీ సంసారం నీ నెత్తినా ?" అంది రత్నమ్మ ఆదుర్దాగా. తల్లి మాటలతో బెదిరించి తన పెళ్ళి పడగొట్టా లని చూస్తున్నట్టు సత్యానికి అనుమానం వేసింది. మొదటినుంచీ చంపకం మనసు ఏ మార్గాల తిరుగుతోందో అంతుపట్టలేకండా వుంది తల్లి. భగవద్గీతను దాచేసింది రత్నమ్మ.

చంపకానికి తల్లి భగవద్గీతను దాచేసిందని తెలుసు. కిందటేడు తను స్నో వాడుతూంటే తల్లి బయటకు విసిరింది. ఈ ఏడాదినుంచి చంపకం వైరాగ్యంలో పడి తన అందచందా లను లెక్కచెయ్యడంలేదు. పూర్వం తన కళాహృదయాన్ని కూడా తల్లీ వాళ్ళు దొంగచాటుగా కనిపెట్టి నాశనం చేశారు. తన మనోవికాసాన్ని కూడా కనిపెట్టే అదేపని చేస్తున్నారు.

పూర్వం చంపకంలోని పట్టుదల తిరిగి వచ్చింది. తన విరోధులు తల్లీ అన్నగారూ—ఎవరూ నమ్మరుకూడా. ఈ మూడో చంపకం తన యిచ్ఛనీ, ఆత్మనీ పదిలపరుచుకుంది. వెనకటి చంపకాలలోని గుణాలు కొన్నే మిగిలాయి. కాని ఈమె రెండుసార్లు దెబ్బలుతిని బాధపడి స్ఫటికంలా మెరుస్తున్నది. తనింకెవరికీ లొంగదు. జీవితంలో రాణించేందుకు తనకెన్నో అవకాశాలున్నాయి.

మనుష్యులు మనిషినుంచి మెదడునీ శరీరాన్నీ ఎలా విడదీయగలరు?



ఈ మూడో చంపకం అద్దంముందు కూచుని చూసుకుంటోంది ప్రతిబింబం. శనివారం, ఇదేరోజు మూడువారాల క్రితం ఎడిటర్ గారింట్లో యీ వేళకి టీ పార్టీలోవుంది. రాధ యింట్లోదగ్గిర వుంటే చంపకం యింత స్వేచ్ఛగా అద్దంలోకి చూసుకునేది కాదు. పక్కన ఎవరన్నా వుంటే అద్దంలో చూస్తూ కళ్లుతిప్పటం, చిరునవ్వు నవ్వడం యిలాంటివి ప్రాక్టీసు చెయ్యడం కష్టం. రాధ ఎప్పుడూ చంపకం పక్షంచేరి తల్లినీ యిందునీ ఎదిరించేది. చంపకంగాని రాధగాని ఒకరి వస్తువులు మరొకరు దొంగచాటుగా చూసుకునేవారు కాదు. ఏడాది నుంచి చంపకానికి విడిగా రూము వచ్చింది. రాధ పక్కవంక చూడగానే దిగులేసింది. "పాపం రాధ కష్టపడి పరీక్ష వ్రాసింది. పొట్టకోసం పనిచేస్తోంది" అనుకుంది. చంపకం తను కష్టపడ్డా ఇతరులు కష్టపడ్తుంటే జాలిపడేది.

ఎవరిగది వాళ్ళకుండటం ఎంతహాయి, కూస్చున్నా వనీ, నుంచున్నావనీ యిలాంటి మాటలుండవు. "నిద్రపట్టదు. లైట్ ఆర్పేయి" అని రాధ గొణగడం వుండదు. చంపకం ఎంతో స్వేచ్ఛగా ఫీలయింది. చంపకం తన అందం విషయంలో శ్రద్ధ చూపించడం నేర్చుకుంది. టేబుల్ మీద స్నోలు, లిప్ స్టిక్, కాటుకడబ్బా, వాసన నూనెలు యిలాంటి సామగ్రి పెరిగి పోయింది. తల్లి ఖరీదు అడిగితే ప్రతివస్తువు ఖరీదూ పదోవంతు చెప్పేది. నిజంచెప్పి తిట్లుపడటం కంటె ఆ సర్దతే బాగుండేది. తనడబ్బు తను ఖర్చుపెట్టుకున్నా అబద్ధమాడాలే-అని కష్టంగా వుండేది. చంపకం ఆహారవిషయంలోకూడా చాలా శ్రద్ధగా వుండేది. అపక్వాహారాన్ని గురించి పుస్తకాలు చదివింది. ఒక పూట పళ్ళు, రెండోపూట బిస్కట్లు. మళ్ళీ అద్దంలోకి చూసు కుంది. తను అనుకున్నంత అందగత్తె అవలేకపోతోంది. నాలు గేళ్ళ క్రితంకంటె కొంచెం పొడుగయింది. కాస్తలావుగా కూడా వుంది. వొంటికి మెరుపు వచ్చింది. జుట్టుకు నిగారింపు ఎక్కువయింది. కాటుక లేకుండానే చంపకం కళ్ళు అందంగా వుంటాయి. నిష్కల్మషంగా, దీనంగా నవ్వుతుంటాయాకళ్ళు. మొదటి చంపకంలోని చిలిపితనం, రెండో చంపకంలోని దైన్యం, మూడో చంపకంలోని తిరుగుబాటూ ఆ కళ్ళల్లో దాక్కు న్నాయి.

చెప్పులు వేసుకు బాగ్ తీసుకుంది. తనవేళ్ళు మృదు వుగా మల్లెమొగ్గల్లా వున్నాయి. తన అందం తననుంచి ఎవరూ వేరు చేయలేరు అనుకుంది మనసులో-గుమ్మం దగ్గిరకొచ్చి.

"అమ్మా బయటికి వెళ్తున్నా. గంటలో వస్తా అంది."

"ఎక్కడికి వెళ్తున్నావ్ ?" తల్లి ప్రశ్న.

"చీనా బజారులో పనుంది. ఆఫీసుపని"

"ఇవాళ శనివారంగా !"

"అయినా పనుంది" అంది నవ్వుతూ. "పళ్ళేమన్నా తీసుకురానా ? కమల టీ కొస్తుందా ?"

"మనం తినేదే కమలకీ పెడ్దాం" నా దగ్గిరున్న డబ్బు సత్యానికి లాంగ్రడిబట్టలు తెప్పించేందుకు యిచ్చాను. కమలను సినిమాకి తీసుకెళ్ళేందుకు యిస్త్రీబట్టలు లేవువాడికి. నీదగ్గర డబ్బేమన్నా వుంటే సబ్బు పట్టుకురా–"

"తీసుకొస్తాలే."

బస్సెక్కింది. అందరిదృష్టి తనమీదేవుంది. అంత అందంగా వుందా తను ? చీనాబజారులో రాజారావు కలిశాడు. అనుకోకుండా కలుసుకున్నారిద్దరూ.

* * * *

టీ తయారయింది. ఇంకా చంపకం రాలేదు. కమల వచ్చేవేళకి ఫలహారం వుండదని రత్నమ్మ ఖంగారుపడ్తోంది. "చంపకం రాలేదు. ఆలస్యం అవుతోంది."

"అదెప్పుడూ అంతే" అంది కిటికిలో కూచుని వీధిలోకి చూస్తున్న యిందు.

"చంపకం వచ్చేటట్టులేదు. నువ్వన్నా వెళ్ళి పళ్ళు తీసుకురా. ఏం వింటున్నావా ?" అంది రత్నమ్మ, ఇందుతో. డబ్బులేదని అబద్ధం ఆడిన రత్నమ్మ, ఇందు చేతిలో అర్థ రూపాయిపెట్టి పరుగెత్తుకు రమ్మని పంపింది.

సత్యం, కమలా వచ్చారు. వాళ్ళమధ్య పానకంలో పుడకలా తనెందుకని వంటింట్లోకి వెళ్ళిపోయింది రత్నమ్మ. ప్రధానమయినా యిన్నాళ్ళు పెళ్ళికాకుండా ఆపడం అంత మంచిదికాదని ఆమె నమ్మకం. కాని తను చెయ్యగలదేముంది!

సత్యం కమలని "కుర్చీలో కూచో" అన్నాడు. గది రోజుకంటె శుభ్రంగా వున్నట్టు కనిపెట్టాడు. కమలది చామన ఛాయ. చిన్న కళ్ళు, పెద్ద ముక్కు, చక్కటి పళ్ళవరస. సత్యంకంటె ఒక చూపువాసి ఎత్తుగా వుంటుంది. మొత్తంమీద సామాన్యమైన మనిషి.

"పాపం, మనకోసం మీ అమ్మగారు గది సర్దించారు కాబోలు" అంది.

"టీ తాగవ్ ?"

"పాపం, ముద్దులబ్బాయికి అమ్మగారిచిన టీ తాగాలని అనిపించిందా ?" అంది కమల ఎద్దేవగా.

"అలా అనకు, అమ్మవింటే బాగుండదు. వేళాకోళం చేస్తున్నామనుకుంటుంది."

"ఆవిడ అంటే నాకు చాలా గౌరవం. ఆవిడకు నా మీద యిష్టం కలగాలనే నా కోర్కె. ఎవరూ వినరుగా మన సంభాషణ."

"నువ్వంటే ఆవిడకూ యిష్టమే."

కమల వెక్కిరింపుగా చూసింది. "ఎందుకా మర్యాద మాటలు ? ఇందాక్కత్తెకే నేనంటే వెర్రి అభిమానం."

"చంపకానికీ, రాధకీ నువ్వంటే చాలా అభిమానం' అన్నాడు సత్యం.

"రాధకి ఏ విషయంలోనూ సమ్మకం లేదు. చంపకం ఎవర్ని ప్రేమిస్తుందో చెప్పనా?"

"ఎవర్ని"

"చంపకాన్నే?"

సత్యం పకపక నవ్వేడు. ఈ మధ్య చంపకంలోని మార్పును అతను ఆశ్చర్యపడుతున్నాడు. కమల తెలివిగా మాట్లాడినా సత్యానికి ఆ ధోరణి బాగుండలేదు.

"నాకు కాని నువ్వంటే యిష్టం. నిన్ను చూసి మెచ్చుకుంటుంది" అన్నాడు సత్యం.

"మన ప్రథానమయి ఈ రోజుకు మూడేళ్ళు నిండాయి."

"ప్రెజంట్లకోసమా జ్ఞాపకం చేస్తున్నావ్?" అన్నాడు సత్యం.

"నువ్వు ప్రెజంట్లు కొనలేవని నాకు తెలుసు" అంటూ ఎడంచెయ్యి చూపింది. ఆ చేతి మధ్యవేలికి నీలంరాయి ఉంగరం వుంది. వుంగరం కొనేందుకు సత్యందగ్గర డబ్బు లేకపోతే కమల తన డబ్బుతో కొని, సత్యంచేత ప్రెజంట్ చేయించుకుంది. అతని మొహం సిగ్గుతో నల్లబడింది.

"ప్రెజంట్లకోసం తాపత్రయపడ్తున్నాననుకోకు. నువ్వు యీ సంసారమంతా మొయ్యాలని నాకు తెలుసు — దీన్ని గురించే మాట్లాడుదామని అనుకుంటున్నా."

"మనకి ప్రథానంఅయి మూడేళ్ళు నిండాయి. నీకు యిరవైఏడు, నాన్నగారికి కాలయాపన ఇష్టంలేదు."

"మీ నాన్నగారి మాటలన్నీ అంతేలే. ఆయనలా నేను తొందరపడి పనులు చెయ్యలేను."

"నాన్న 'చెయ్యలేను' అనేమాట బాగుపడే వాడు అనడు అంటారు."

"నేను ఒప్పుకోను. గొప్పవాడు చెయ్యలేని పనులు చాలా వున్నాయి—అయినా నేను గొప్పవాడినికాను."

"నువ్వు కోపం తెచ్చుకోకు. ఈ విషయం మనం తేల్చుకుంటే మంచిది."

"నేను ముందు నీతో మాట్లాడుతున్నానో. లేక నాకూ మీ నాన్నకూ మధ్యనుండే రాయబారితో మాట్లాడుతున్నానో తెలుసుకోవాలి."

"నూనాన్న నేమన్నా అంటే వూరుకోను. నన్ను నువ్వు పెళ్ళి చేసుకుంటావా ?"

"అదేమిటి కమలా ?"

"చేసుకుంటావా - చేసుకోవా ?"

"చేసుకుంటాను. నువ్వు నన్ను చేసుకుంటావా లేదా?"

"నాకు పెళ్ళి చేసుకోవాలనే ఉంది."

"నిజగా చెప్తున్నావా ?"

"ఇన్ని మాటలెందుకు ! నాన్న మనకి యీ వేసంగిలో పెళ్ళి చేయాలని అంటున్నారు."

"ఎల్లా ! నా పరిస్థితులు నీకూ మీ నాన్నకూ తెలుసుగా ?" అతని మొహం తెల్లబోయి దీనంగా వుంది.

"నువ్వు మీ వాళ్ళమీద అంత పక్షపాతం చూపించ కూడదు. నేను ఒక బీదవాణ్ణి పెళ్ళాడబోతున్నాను. భవిష్యత్ లో అతను నన్ను పోషించలేక పోవచ్చు. అలాంటి త్యాగం ఆడపిల్లలు చెయ్యడం చాలాఅరుదు. కాని నేను కళ్ళు రెండూ తెరిచే చేస్తున్నాను. ప్రతిఫలంగా నాకు నీమీద కొంత హక్కువుండాలి."

"నిన్ను సుఖపెట్టాలనే నా కోర్కె. అవకాశం వున్నంత వరకు నిన్ను కష్టపెట్టను. నాకే ఛాన్సువుంటేనా ?"

"ఏమిటీ ! డాక్టర్ అయే ఛాన్సేనా ? నేను మర్యాద గల కుటుంబంనుంచి వచ్చాను. దేశంలో నీలాంటి థరడ్ రేట్ డాక్టర్లు బోలెడంతమంది వుద్యోగాలు లేక కొట్టు కుంటున్నారు. నాకు అల్లాంటివి గిట్టవ్" అంది కమల.

"స్టేజిమీదకు వెళ్తే నన్ను పెళ్ళాడవా !"

"అవన్నీ వుత్తమాటలు. నీకు ఛాన్సురాదు. ప్రతివాళ్లు పెళ్ళెప్పుడని అడుగుతున్నారు. నెలకు నీకు నలభై యిస్తారు కదూ ! నాకు మా నాన్న నెలకు యిరవైయ్యో, ముప్పైయ్యో యిస్తారు. మొత్తం ?"

"డబ్భై" అన్నాడు సత్యం.

జాగ్రత్తగా వాడుకుంటే సరిపోతాయి. నువ్వీ వుద్యోగానికి అంటిపెట్టుకుంటె నాన్న యింక్రిమెంటు యిప్పిస్తారు."

"మా అమ్మనీ, పిల్లల్నీ మర్చిపోవాలా !"

"ఎల్లా మర్చిపోతావు. ఎప్పుడూ ఈ వూళ్లోనే వుంటాముగా !"

సత్యం వాడిగా చూశాను.. కాని ఏంలాభం ?

"మీ వాళ్ళకి సాయం జేయాలనే నా కోర్కె—నుండాను—ఆడాళ్ళు మొగాళ్ళమీద ఆధారపడే రోజులు పోయాయి. మీ అమ్మ అందిరికిమల్లే బయట పనిచెయ్యాలనుకో. ఆవిడ కేమన్నా స్వంత డబ్బుందా, మనలో మనమాట ?"

"ఉన్నదంతా మా చదువులకే అయింది."

"కోపం తెచ్చుకోకు. మనకు ప్రధానం అయింది. యింకా దాపరికం ఎందుకు? ఇందు అమాయకంగా వుంటుంది."

"అది తెలివి తక్కువది" అన్నాడు సత్యం.

"రాధ ఏమన్నా డబ్బు యింట్లోకి యిస్తుందా ? నాకు నువ్వెప్పుడూ యీ విషయాలు చెప్పలేదు. అందుకు అడుగుతున్నా."

"రాధ సంపాదనలో దమ్మిడీ యింటికి యివ్వదు."

"బలే స్వార్ధమే" అంది కమల.

"చంపక మీమధ్య డబ్బుయి యనభై రూపాయల దాకా సంపాయిస్తోంది."

కమల ఆశ్చర్యపోయింది. రచయితలు వందలూ వేలూ సంపాయిస్తారని అనుకునేది, "యిన్నాళ్ళనుంచి వాళ్ళను నువ్వు పోషించలేదూ ! ఇంక చంపకం చూసుకుంటుంది"

"చంపకం వొళ్ళొంచి పనిచేయదని నా వుద్దేశం. తెలివి తేటలున్నాయి: కష్టపడితే యింకా చాలా డబ్బు సంపాయిస్తుంది. చంపకానికి పోయ తెక్కువ. మొగాళ్ళతో పూసుకు తిరుగుతుంది. అక్షేపిస్తున్నా ననుకోకు. సుఖమే చూసుకుంటుంది. కొంచెం కష్టపడితే—?" అంది కమల.

సత్యం కిటికీదగ్గిర నుల్చుని బయటకు చూస్తున్నాడు.

"చంపకం పెళ్లి చేసుకుంటే" అన్నది కమల.

"కొన్నాళ్ళు ఆగుతుంది. నే నిన్నాళ్లూ పెళ్ళి చేసుకోకుండా వుండలేదూ ?" అన్నాడు సత్యం.

టేబుల్ మీద హాండ్ బాగ్ తీసుకొని "నాన్న కేం చెప్పను ?" అంది కమల.

"అప్పుడే వెళ్ళిపోతున్నావా ? టీ తీసుకోవూ ?"

"నాకు సమాధానం కావాలి. ఏంచెప్పను ?"

"అంత హడావుడిపెడ్తే ఎట్లా ? నాకు టైము కావాలి ఆలోచించుకునేందుకు."

"ఏమి టాలోచించేది. నాలుగేళ్ళ నుంచి ఆలోచిస్తున్నావ్."

"కొంచెమన్నా మర్యాద వుండాలి. నామీద ప్రేమ వుండి పెళ్ళి చేసుకుంటున్నావా ? లేక పెళ్ళవదేమోనని తొందరపడ్తున్నావా? నీ కన్నా, మీ నాన్నకన్నా నన్ను వొదిలించుకోవాలనివుంటే ముఖంమీద చెప్పివెయ్యండి. మిమ్మల్ని నేను మోసగించినట్లు మీరు నటించనక్కరలేదు. ఎవరినన్నా ప్రేమించావా ?" అన్నాడు సత్యం దూకుడుగా.

కమల అతని దగ్గిరికెళ్ళి నుదుటమీద తేలిగ్గా లాలనగా ముద్దుపెట్టుకుంది. "అంత చిరాకెందుకు ?" అంది.

"ఎవరన్నా చూస్తారు. వీధికేసుు" అన్నాడు సత్యం.

కమల దూరంగా వెళ్ళి వీధివంక చూసింది. "చంపకం ఎవరినో వెంట తీసుకొస్తోంది. అతనెవ్వా తెలుసు ?"

"చంపకం ఎప్పుడూ ఎవరినో కలుసుకుంటూ నేవుంటుంది. అతను నీకు తెలుసా?" అన్నాడు సత్యం.

"నాకు తెలియదు" అంటూ పక్కకుర్చీలో కూల బడింది కమల.



చంపకం - రాజారావూ లోపలికొచ్చారు. కమలా, రాజారావు ఒకరికొకరు నమస్కారం చేసుకున్నారు. "ఇది వరకు మనమోసారి కలుసుకున్నాం" అంది కమల.

"అవును" అన్నాడు రాజారావు. సత్యం, చంపకం మొగ స్నేహితులందరిని చూసినట్టే రాజారావునీ నిర్లక్ష్యంగా చూశాడు. రాజారావు దుస్తుల్లో, మొఖంలో దర్జా, అందం కనిపించాయి. మనిషి కొంచెం సిగ్గుపడ్తున్నాడు. కమలా రాజా రావులు పూర్వపరిచయు లనేటప్పటికి చంపకానికి ఎందుకో కష్టం వేసింది.

"కమలగార్ని ఆరేళ్ళక్రితం బెంగుళూరులో చూశాను. అదే హోటల్?"

"మా బాబాయి వూళ్లో లేకపోవటంవల్ల హోటల్లో బసచేశాం. ఆ ఏడు వేసంగి చిటికవేసేటంతలో గడిచిపోయింది" అంది కమల.

పళ్ళసంచీ తీసుకు లోపలికి వెళ్లింది చంపకం. వంటింట్లో సామానులు చిందరవందరగా వున్నాయి. కుంపటిమీాద నీళ్లు తెర్లుతున్నాయి. రత్నమ్మ పీటమీాద కూచుని ఏడుస్తోంది.

చంపకం లాలించి బతిమలాడగా రత్నమ్మ, సందుదాకా ఇందును ఎవరో వెంబడించారని, చేతిలో పళ్ళు కిందపారేసి దొడ్డిదార్ని ఇంట్లోకి పడిందనీ చెప్పింది. ఇందు జడుసుకుంది. సత్యానికి తెలియనియ్యకుండా ఇందును పడుకోబెట్టిందిగదిలో.

"టీ పట్టుకెళ్ళి - యియ్యి" అంది రత్నమ్మ, యాపిల్ను ముక్కలుగా తరిగి.

"నువ్వు రావూ, రాజారావుగారు కూడా వచ్చారు" అంది చంపకం.

రాజారావుని గురించి రత్నమ్మ ఇదివరకే వింది. "నువ్వు పట్టుకెళ్ళమ్మా" అంది; నవ్వుతూ, తాను యిందుదగ్గర వుంటా లంది. తల్లి నవ్వుముఖం చూసి చంపకం పొంగిపోయింది. నలుగురికీ టీ తీసుకొచ్చింది. కమలా రాజారావు ఒకటి రెండు మాటలు మాట్లాడుకున్నారు. వారిద్దరికీ అప్పటే పరి చయం లేదని చంపకం తృప్తిపడింది. సత్యం ముభావనగా వున్నాడు. రాజారావు వుత్సాహంగా వాళ్ల కుటుంబాన్ని గురించీ కాఫీతోటలు గురించీ సత్యానికి చెప్తున్నాడు. ఈ సంతోషంలో చంపకం ఇందు సంగతి మర్చిపోయింది. టీ ముట్టుకోకుండానే కమల వెళ్తానని లేచింది. సత్యంగూడా వెంటనే లేచాడు.

"నాతో రావద్దు. నాన్నకు ఏం సమాధానం చెప్పను?" అంది కమల కోపంగా.

'దేన్ని గురించి?' అంది చంపకం పరధ్యానంగా. చంపకం, రాజారావు కనుబొమ్మల్ని చూస్తోంది. నల్లగా ఆర్చిల్లా అతని కనుబొమలు ఎంతో బావున్నాయి చంపకానికి.

"సత్యానికి తెలుసు" అంది కమల.

"నీ వెంట నేనూవస్తూన్నా" అని లేచాడు సత్యం.

"నాతో రావద్దన లేదూ" అంది కమల విసుగ్గా. కమల నవ్వుతూ రాజాకి నమస్కారం చేసింది. రాజా ముభావనగా తిరిగి నమస్కారం చేశాడు. చంపకం రాజా ముఖంలోని శాంతిస్యంచూసి ఆశ్చర్యపడింది. కమల వద్దంటున్నా సత్యం వెంట వెళ్లాడు. వెళ్తూ "మీరూ వస్తున్నారుగా !" అన్నాడు రాజాతో. ముగ్గురూ గుమ్మందగ్గర కెళ్ళారు. చంపకాని కిదంతా అయోమయంగా వుంది.

వాళ్ళు వెళ్ళిన తరువాత చంపకం అద్దంలోకి చూసు కుంది. అదే అద్దంలో సత్యం లాల్ జీతో మాట్లాడిన సాయం త్రం పోజులు చూసుకున్నాడు. తన మొహం చూసుకుని నవ్వుకుంటూంటే వెనక రాజా ప్రతిబింబం కనపడింది—సిగ్గుపడి వెనక్కు తిరిగింది.

"సిగ్గెందుకూ ? నీ అందాన్ని నువ్వు చూసుకుంటే తప్పు లేదు" అన్నాడు.

"ఎల్లా వచ్చారు ?"

"కమలా మీ అన్నా కుడివైపు సందులోకి వెళ్ళారు. నేను ఎడంవైపు సందులోకి వెళ్లాను. చుట్టుతిరిగి గుమ్మంవద్దిర కొచ్చాను. భూమి గుండ్రంగా వుందిగా ! తలుపు పూర్తిగా వెయ్యకపోతే ఎవరన్నా దొంగలు జొరబడరూ ?" అన్నాడు, నవ్వుతూ.

"అంత హఠాత్తుగా వెళ్ళిపోయి, మళ్ళీ ఎందుకొచ్చి నట్టు ?"

"నువ్వు చాలా అందంగా వున్నావని చెప్పేందుకు."

చంపకం సిగ్గుపడి తల వంచుకుంది.

"ఎంతందంగా వున్నావ్ – నిన్ను నేను ప్రేమిస్తున్నాను. నేనంటే నీ కిష్టమేనా ?"

చంపకం సిగ్గుతో తలతిప్పింది.

రాజా ఆమెని తన చేతుల్లోకి తీసుకున్నాడు.

* * * *

రాజారావు చంపకం కోసం వచ్చి ముందు రూములో కూర్చున్నాడు. పదిహేను రోజులయింది– చంపకానికీ, రాజాకీ ప్రధానం జరిగి. రాజాకి చంపకం కుటుంబం అంటే అంత యిష్టంలేదు. కాని చంపకాన్ని తృప్తిపరిచేందుకు వాళ్లతో కలిసిమెలిసి వుండేవాడు.

సత్యం తెలివితక్కువను ఎరగనట్లు వోపిగ్గా వూరుకునే వాడు. రత్నమ్మ పొగడ్తలు వోపిగ్గా భరించేవాడు. ఇందు యిరవైనాలుగేళ్లు వచ్చినా పాపలా చిలకపలుకులు పలుకు తుంటే అతనికి నవ్వొచ్చేది. ఇంట్లో అందరూ ఒకఎత్తు, రాధ ఒక ఎత్తు – రాధ చంపకానికి చెల్లెలంటే నమ్మలేక పోయే వాడు రాజా – రాధ ఖద్దరు బట్టలు కట్టుకుని మొగాడల్లే అందరినీ ఎదిరించి మాట్లాడేది. రాజాకి ఆవిడ నిర్లక్ష్యం నచ్చేదికాదు. వీళ్ళందరిలో చంపకం తప్పబుట్టినట్టుండేది.

తలుపు చప్పుడయింది, తలెత్తి చూశాడు. ఎదురుగా కమల.

అతని మొహం ముడుచుకు పోయింది. కమలతో ఎంతో మర్యాదగా ప్రవర్తిద్దామనుకున్నా అతనికి ఎందుకో అసహ్యంగా వుండేది మనసులో. చంపకాన్ని తల్చుకునే టప్పటికి అతని హృదయం ప్రేమతో నిండిపోయింది. రాని నవ్వు తెచ్చుకొని "చంపకం ఇంకా రాలేదా ?" అన్నాడు.

"కూర్చోండి మీతో మాట్లాడాలి" అంది కటువుగా. కూర్చున్నాడు.

"మీతో యిలా వంటరిగా మాట్లాడేందుకు ఎంత కాలం నుంచో ప్రయత్నిస్తున్నాను. అవకాశం చిక్క లేదు. మీకు రాసేందుకు నా దగ్గిర ఎడ్రసుకూడా లేదు."

"దేనికి ?" అన్నాడు ఆశ్చర్యంగా.

కమల కొన్ని క్షణాలు వూరుకుంది. సంభాషణ మొద లెట్టేందుకు మాటలు వెతుకుతోంది. "సత్యం మిమ్మల్ని గురించి నన్ను ప్రశ్నలు వేస్తున్నాడు."

"నన్ను గురించి చెప్పేందుకేముంది ?"

"ఏమీ లేదు. చంపకం నన్ను గురించి అడిగిందా ?"

"అడగలేదు" కమలమాటే మర్చిపోయారు చంపకం, రాజా.

కమల మొహం వికారంగా పెట్టింది. రాజాకి ఆమెతో మాట్లాడటం యిష్టంలేదు. ఆవిడ దొంగచూపులు అతనికి పరమసహ్యంగా కనిపిస్తున్నాయి.

"చంపకానికి మనల్ని గురించి తెలుసుకోవాలని కుతూహలం లేకపోయినా మిగిలిన వాళ్లకు వుంటుందిగా— ఇంకెవరూ అడగ లేదూ ?"

"రత్నమ్మగారు అడిగింది – మనం బెంగుళూరులో కలుసుకున్నామని చెప్పాను. మనిద్దరం లాల్ బాగ్ కు ఒకసారి వెళ్లామనికూడా చెప్పాను."

కమల ముఖం ఎర్రబడింది.

"అంతకంటె నేనింక ఒక్క మాటకూడ అనలేదు – నువ్వు ఆదుర్దా పడనక్కర లేదు."

"ఆదుర్దాపడటం దేనికి ?" అంది కమల–

"మనిద్దరిమధ్యా జరిగిన సంగతిగురించి నువ్వు భయపడ్డావేమోనని చెప్పాను. జరిగినదాన్ని గురించి నేను పెదవి మెదపను."

"పాపం, చాలా గొప్పవాడివి" అంది కమల హేళనగా. "నువ్వు చెప్పినా సత్యం ఒక్క మాటకూడ నమ్మదు."–

"జరిగినదాన్ని గురించి మనం మాట్లాడటం అనవసరం– అదంతా మర్చిపోయాం. నువ్వు సుఖంగా వుండాలని కోరుతున్నా."

"ఎంత మంచితనం!"

"మంచితనం కాదు–సత్యా నాకు బావమరిది కాబోతున్నాడు– అతని భార్యవి నువ్వు – ఈ చుట్టరికంవల్ల మనం ఆప్తుల మయాం."

చంపకానికీ నీకూ నిజంగా ప్రధానం జరిగిందా?"

"నిజంగానే! సత్యం తల్లి నీకు చెప్పలా?" ఆశ్చర్యంగా అడిగాడు రాజా.

"సత్యం మీ ప్రధానాన్ని గూర్చి అంత సీరియస్‌గా తీసుకోలేదు. చంపకానికి వుత్తుత్తి ప్రధానాలు చాలా జరిగాయి."

"ఈసారి నిజంగానే జరిగింది. తొందరలో పెళ్లికూడా అవుతుంది" అన్నాడు రాజా పళ్ళు బిగిస్తూ.

"నిన్ను ఒక్క విషయం అడగాలనివుంది - మనిద్దరం లాల్‌బాగ్ వెళ్ళినపుడు నువ్వు సంతోషంగా లేవూ?"

"అది మర్చిపోయిన సంగతి- అయినా యిప్పుడెందుకా విషయం?"

"నాకు తెలుసుకోవాలని వుంది" కమల కళ్ళు ఎర్రగా ఆకలితో చూస్తున్నట్టున్నాయి.

రాజారావుకు లాల్‌బాగ్‌లోని దృశ్యం కళ్ళకు కట్టినట్టయింది. మామిడిచెట్టు నీడలో రాజాను ప్రేమిస్తున్నాననీ పెళ్ళి చేసుకోమనీ కోరింది. తనకప్పటికి ప్రపంచజ్ఞానం అలవడలేదు. కమల తనకంటె ఒకఏడు పెద్దది. అలాంటి పిల్ల తెగించి మాట్లాడటంచూసి తను ఆశ్చర్యపోయాడు. ఆనాడు ఎంతో సిగ్గుపడిపోయాడు. అతని హృదయం సిగ్గుతో, ఆశ్చర్యముతో నిండిపోయింది. "మనం అలాంటి విషయాలు మర్చిపోవడం మంచిది. అపుడు నీవు చిన్నదానివి, నేనూ, చిన్నవాణ్ణి. ఆ కుళ్ళును బయటకు తేకుండావుంటే మనిద్దరికీ మంచిది."

"కళ్ళా! తన మనసులో ప్రేమను ప్రేమించినవాడి ముందు పెళ్ళి పెట్టడం కళ్ళా? ఆ రోజునుంచి నీకోసం ఎంత ఏడ్చాను. ఎంత ఆశతో వున్నా! ఎన్నేళ్ళయినా నీమీద ప్రేమ పోలేదు నాకు. అప్పుడు బాలికని; యిప్పుడు స్త్రీని. నేను నిన్ను ప్రేమిస్తున్నా ఈనాడుకూడా" అంది కమల.

"ప్రేమించి ఏం లాభం! నువ్వు సత్యాన్ని పెళ్ళాడి సుఖంగా వుండటం మంచిది. చిన్నతనంలో వూసుబోక పిచ్చి పిచ్చి వ్యామోహాల్లో పడ్డాను. కష్టసుఖాలు తెలియని రోజులవి నీను."

"పాపం. నీతులు చెప్పొచ్చావ్! నాకు శాంతి లేకుండా చేశావ్. ప్రతిక్షణం నీమీద ప్రేమ నన్ను కాల్చేస్తోంది. నిజంగా నామీద నీకు కొంచెంకూడా ప్రేమ లేదూ?"

"నిన్ను చూస్తే అసహ్యం వేస్తోంది" అన్నాడు రాజా.

కమల పెద్దగా నవ్వుతోంది. రాజా కమలకి పిచ్చెక్కిందేమో అని భయపడ్డాడు. కమలని చాలా జాలిగా చూశాడు. [illegible] వుండలేకపోయాడు. "ఎంత పిచ్చివాడివి! చెప్పిందంతా నిజమని నమ్మావూ? నిన్ను పిలిచి ఏడ్పించను కున్నావా? పురుషుడివి నువ్వు!" అంది కమల క్రూరంగా.

రాజా తనలో తాను నవ్వుకున్నాడు. "కల్లాకపటం నేనా [illegible] తెలియదు. ఎదిగిన నువ్వు స్త్రీవి. [illegible] అయినా స్త్రీలా మసులుకోడం నేర్చుకో" అన్నాడు విసుగ్గా.

"అవును, మర్చిపోవాలి. ఏం జరగనట్టు నటించాలి. మనిద్దరిబదులూ మర్యాదగా నువ్వే నటించు. నీకా చాతుర్యం చాలావుంది" అంది కమల కసిగా.

"వెళ్లొస్తా." రాజా సందుమలుపులోకి వెళ్లాడు. కమలకి నిజంగా తనమీద కోర్కెవున్నా, ఆరేళ్ళదాకా మర్చిపోకుండా వుంటుందా? ఆరేళ్ళలోనూ ప్రేమ మర్చిపోయుండిగాని ఆ గాయం మానలేదు. ఆవిడ అహం దెబ్బతింది. మానుపడ్తున్న గాయం తనరాకతో రేగింది మళ్లీ. కమలలో మృగత్వం ఎక్కువ. నాజూకు శూన్యం. చంపకం సుకుమారి. యీ రాపిడి ఆమెకి తెలీదు. కమలకి పగ, ఉక్రోషం. చంపకానికి దయ, సౌశీల్యం. ఎంత తేడా యిద్దరికీ. ఒకే మురికిగుంటలో రెండు భిన్నప్రకృతులు. పైకి యిద్దరూ స్త్రీలే. కాని లోపల ఒకామె నక్క, మరొకామె మేక. అతని సున్నితహృదయం ముళ్ళ చెట్టుమీదపడి చిరిగిపోకుండా పూలతీగెను పెనవేసుకుంది.

దారిలో చంపకాన్ని కలుసుకున్నాడు. మాటల్లో చంపకం "నేను అందంగా లేనూ?" అంది.

"నువ్వు నిర్మలంగా నదీకన్యలా ఉన్నావు."

"మీరు నన్నెందుకు ప్రేమిస్తున్నారు?"

"నీ అందం చూసి."

"ప్రేమించేందుకు అదొక్కటే కారణమా?"

"కొంతమందికి రూపం వుంటుంది కాని అందం వుండదు. నువ్వలా కాదు. నీ అందం పూపరిమళంలా, కాంతికిరణంలా సెలయేటిపక్కలా అల్లుకుపోతుంది" అన్నాడు చంపకం జుట్టును ప్రేమతో తాకుతూ.

"నేను ఇంత అందంగా లేకపోతే ప్రేమించరా ?"

"నువ్వెల్లా వున్నా ప్రేమిస్తాను. నీ రూపురేఖల్ని కాదుగా నేను ప్రేమిస్తున్నది– నీ హృదయాన్ని."

ఇద్దరూ నిశ్శబ్దంగా నడిచారు కొంతదూరం. రాజా గబుక్కున ఆగి "కమలతో ఆట్టే సంబంధం పెట్టుకోకు" అన్నాడు.

"ఏం ?"

"కమల నివురుగప్పిన నిప్పు. ఆమెది వక్రదృష్టి. ఎవరికో అపకారం తలపెడుతూంటుంది. నేను మరోప్పుడు తీరిగ్గా చెప్తాను కమల సంగతి."

"నాకు కమలగురించి ఏమీ తెలుసుకోవాలని కూడా లేదు."

"నువ్వు చాలా అమాయకురాలివి."

"శుద్ధ మొద్దావతారం అంటారా ?"

"నీకు ఒకవిధంగా ప్రపంచజ్ఞానం తెలియదు. ప్రపంచంలో చెడు వుందంటే నమ్మలేనంత మంచిదానివి. నువ్వు ముగ్ధవి. మనుషుల నిజరూపాలు నీకు తెలియవు."

"నిజంగానే తెలియదు – అందుకే నా కథలు ఎక్కువమంది చదువుతారు– 'మనుషులకి నిజం అక్కరలేదు–' మా ఎడిటర్ ఆ మాటే అంటూంటారు– కమలకి నా మీద పగ ఎందుకుంటుంది–నాతో బాగానే మాట్లాడుతుంది–"

"కమల మనసులో నిన్ను శపించిపోస్తుంది."

"ఎందుకు ?"

"కమలకి నువ్వంటే జెలసీ – నీ మొహం అద్దంలో చూసుకో– కారణం నీకే తెలుస్తుంది– అంతదాకా ఎందుకు? యిందు, రాధా మీ వాళ్ళకికూడా నీ మీద జెలసీవుంది. ఆఖరికి మీ అమ్మకికూడా. నా మీద కోపం తెచ్చుకోకేం అలా అంటున్నాననీ–వాళ్లు అనుకోకుండానే నీకు అపకారం చేస్తారు. మేధావిని మనుషులందుకే ద్వేషిస్తారు–"

"నేను రోజూ వాళ్ళతో కలిసీమెలిసీ బతుకుతా. నా అందంలో వాళ్ళకి ప్రత్యేకత కనబడదు. అలవాటు చేత నేను అందగత్తెననికూడా మర్చిపోతారు" అంది చంపకం.

"అది వాళ్ళకే తెలియని రహస్యం. మీ వాళ్ళసంగతి అనవసరం – కాని కమల విషయంలో మటుకు జాగ్రత్తగా వుండు."

"నాకెవ్వరు మాత్రం ఎందుకు అపకారం తలపెడతారు?" అంది చంపకం నిశ్చింతగా. అవి పై మాటలుగాని మనసులో ఎందుకో దుడుకుపుట్టింది.

రాజారావు ఆస్తిని యిన్నాళ్లూ మేనమామే చూసేవాడు. మేనమామకి చంపకంమీద ప్రేమగురించి, ప్రధానం గురించీ రాజా యిదివరకే రాసివున్నాడు. మేనమామ తొందరగా కోయంబత్తూర్ వచ్చి తన బుజాలమీద బరువుదించమని రాజారావుకు రాశాడు. ఆ వుత్తరం రాజారావు చంపకానికీ, రంగనాథానికీ చదివి వినిపించాడు.

## ౧౦

సాయంత్రం ఆరయింది. చంపకం ఆఫీసునుంచి వచ్చింది. ఇవాళ చాలా హుషారుగా వుంది. ముందుగదిలో ఎవరో కూచున్నారు. ఎవరో కొత్తమనిషి. ఎర్రగా, బొద్దుగా వున్నారు. కొంచెం మోటుగా కనిపిస్తున్నాడు. ఆశ్చర్యంతో గుమ్మందగ్గిర ఆగింది చంపకం.

"మీ అన్నయ్యకోసం వచ్చారా?"

"లేదు మీ చెల్లెలికోసం వచ్చాను. రాధ మీకు చెల్లెలను కుంటా."

"అవును" అంది చిరునవ్వుతో చంపకం. "మీ ఇద్దరి ముఖాల్లో పోలికలు బాగా కనపడ్తున్నాయి."

"రాధను పిలుస్తాను. మీ పేరు?"

"నా పేరు వెంకట్రావ్"

రాధ రెండుమూడుసార్లు వెంకట్రావ్ పేరు చెప్పడం వింది చంపకం. వెంకట్రావు రాధ స్నేహితురాలికి బంధువు అన్నట్లు జ్ఞాపకం. వచ్చినతని మాటల్ని బట్టి వాళ్ళిద్దరికీ బాగా పరిచయం వున్నట్టే అనిపిస్తోంది.

"రాధా నీకోసం వెంకట్రావుట – వచ్చారు. ముందు గదిలో వున్నారు. పాపం చాలాసేపయినట్టుంది" రాధ లోపల చదువుకుంటోంది.

"తలుపు ఎవరు తీశారో? అమ్మ తలుపు తీసికూడా, అతను వచ్చాడని చెప్పలేదు" అంది కోపంగా రాధ.

"అమ్మ తెరవలేదనుకుంటూ, ఇందు తీసిందేమో! చెప్పటం మర్చిపోయి వుంటుంది. ఇంతా ఇలా మర్చిపోవడం చాలాసార్లు జరిగింది."

"తలుపు ఇందు తియ్యలేదు. అదిప్పుడే బయటనుంచి వచ్చింది. ఏదో జబ్బు కుంపట. అమ్మ ఆ బుచ్చిపాపాయిని సముదాయిస్తోంది."

"అల్లాంటి మాటలనకు. రాజా మొట్ట మొదటిసారి మనింటికి వచ్చినరోజునా అది అల్లాగే జబ్బుసుకుంది."

"అంతా కోతలు" అంది రాధ.

రాధ ముందు గదిలోకి వెళ్ళిపోయింది. ఇందును మళ్ళీ ఎవరన్నా వెంబడించారు గాబోలని తల్లి రాధతో చెప్పింది. రాధకి అల్లాటి విషయాలు అర్థమవవు. పక్కయింట్లోంచి 'నీదు చరణములే' అని వీణావాద్యం వినపడుతోంది. చంపకం మనసులో సంతోషంగా వుంది. రత్నమ్మ మెట్లుదిగివస్తూ చంప కాన్ని చూసి "ఇది యిల్లనుకున్నావా, హోటలనుకున్నావా! మధ్యాహ్నం కాఫీకి రాలేదేం? ఎవరా మనిషి? ముందు గదిలో వున్నట్టున్నాడు—రాధకోసమేనా?"

ఇద్దరూ ముందుగదిలోకి వెళ్ళారు. రత్నమ్మ వెంక ట్రావు వంక కోపంగా చూసింది. అతను ఇబ్బందిగా తల వంచుకు కూచున్నాడు. చంపకం అప్పుడో మాటా అప్పుడో మాటా మాట్లాడుతోంది.

"మీరు మా రాధ స్నేహితురాలి అన్నగారలుగా. ఆవిడ మీచేత కబురేమన్నా పంపిందా?" అంది రత్నమ్మ.

"ఎష్నీ – లేదండి, నాకవేం తెలియదు"

"రాధ స్కూల్లో మీరొక్కరేనా టీచరా?"

"కాదండి – నాకు ప్రొవిజన్ స్టోర్ వుంది."

రాధ వెంకట్రావు వంక విసుగ్గా చూసింది. రత్నమ్మా చంపకం చూపులు మార్చుకున్నారు.

"సినిమాకి వెళ్దామని బయలుదేరాను?" అన్నాడు వెంకట్రావు.

"రాధకీ మీకూ స్కూల్లో పరిచయం వుందా" అని మళ్ళీ అడిగింది రత్నమ్మ.

"అప్పుడప్పుడు కలుసుకునేవాళ్ళం"

"ఏం సినిమాకి వెళ్తున్నారు?"

"రాధ కిష్టమయిన పిక్చరుకి."

"రాధేమిటి?" అంది రత్నమ్మ ఆశ్చర్యంగా.

"రాధకూడా వస్తుందని వచ్చా..." చంపకానికి పరిస్థితి అసహ్యంగా తయారవుతుందని భయమేసింది.

"తొందరగా డ్రెస్ చేసుకోవే రాధా – నేను మాట్లాడుతూ వుంటా" అంది చంపకం.

రత్నమ్మ చంపకంవంక చురచుర చూసింది. రాధ అక్కయ్య ప్రవృత్తి పరిశీలిస్తూ చూసి లోపలికి తప్పుకుంది.

వాళ్ళు వెళ్ళిం తరువాత రత్నమ్మ "ఆ పుప్పా మిరప కాయా అన్నవాడెవడే? రాధ తిరిగేందుకు నువ్వుగూడా సాయం చేస్తున్నావా? మనకి గౌరవ మర్యాదలు వద్దూ?" అంది చంపకంతో.

"అదేమిటమ్మా అట్లాంటావ్! రాజారావుగారికి కాఫీ గింజల వర్తకం అంటే గింజలమ్మడం కాదూ?"

"రాధ ఆ అబ్బాయితో అల్లా తిరగడం నువ్వు వొప్పుకు సాయంచేయడం నాకు బాగుండ లేదు."

"అతను షికారీ కొట్టుపెట్టుకుంటే నష్టమేమిటి? రాధని అతను ప్రేమించాడేమో?"

"రాజా పెద్దమనిషి — యీ కుర్రాడు అలగాగుంపులా ఉన్నాడు."

"ప్రేమకి మర్యాదలనీ, అలగాజాతి అనీ ఉండదమ్మా. రాధను, అతను ప్రేమిస్తే తప్పేమిటి?"

రత్నమ్మ కంటిలో నీరు తిరిగింది. "ఇంటి సంగతి నాకు ఖంగారుగా వుంది. మల్లీ వెనకటి కుర్రాడు వెంటపడ్తా డంటుంది. పిచ్చినవ్వు నవ్వుతుంది. ఏడుస్తుంది. భయమేస్తోం దని వెర్రిగా చూస్తుంది. నా గోడు ఎవరూ వినరు — రాధ ఉత్తదే అని కొట్టేస్తుంది" అంది రుద్ధకంఠంతో తల్లి.

"సత్యానికి చెప్పకపోయినావా?"

"ఎట్లా చెప్పను? సత్యం ప్రతివిషయం కమల చెవుల్లో వూదుతాడు. అసలు కమలకి యిందే చెప్పేస్తుందేమోనని నా భయం. కమల యిందుని తను లొంగదీసుకోవాలని చూస్తోంది."

చంపకం ఆశ్చర్యపోయింది. ఈ పోంకపోకలెలా మొత్తే తెలీవు. "పోనీ రాజారావుగారికి చెప్పనా?" అంది.

"ఏమని చెప్తావ్?"

"ఇందుని వెంబడించేవాడికి ఆ హోకే కనుక్కోమని."

రత్నమ్మ కూతురి చెయ్యిపట్టుకుంది. "వద్దు! అతనికి అర్థం కాదు. లోకులు యిందుని గురించి..."

చంపకానికి ఏదో భయం వేసింది. తల్లి తనదగ్గిర నుంచి ఏదో దాస్తోంది. తన మనసు దేనినో శంకిస్తోంది— తన ఆనందానికి ఏదో అడ్డు తగులుతుందనే భావం ఆవిడ మనసులో ఉందా?

* * * *

శనివారం. చంపకం వివాహం సరిగ్గా వారంరోజులుంది. వచ్చే శనివారం రాత్రి పెళ్ళి. ఆదివారం రాజా, చంపకం కోయంబత్తూరు వెళ్ళిపోతారు.

శాంతాదేవి చంపకాన్ని టీకి పిలిచింది. శాంతాదేవి రంగనాథం బావమరిది భార్య. మూడుగంటలయింది. కొంచెం మబ్బుగా వుంది. ఇద్దరూ సంతోషంగా కబుర్లు చెప్పుకుంటూ టీ తాగుతున్నారు.

"సోమవారంనుంచి ఆఫీసుకు రావన్నమాట" అంది శాంతాదేవి.

"ఇంకా బట్టలూ అవీ కొనుక్కోవాలి—యింట్లో హాయిగా ఉండి. ఆఫీసుకి రాలేకపోయినా, యింటికొచ్చి కనిపించి పోతూ ఉంటాగా" అంది చంపకం.

"నువ్వు అదృష్టవంతురాలివి. రాజా రావు చిన్నప్పటి నుంచీ నాకు తెలుసు— బుద్ధిమంతుడు. సరాసరి కోయంబత్తూరేనా మీరు వెళ్ళడం?"

"ఇప్పటికే వారి మేనమామ తొందరపడుతున్నారట. పెళ్ళికికూడా ఆయన రారట."

"కారుకూడా తీసుకెళ్తారా ?"

"కారంటె ఆయనకి ప్రాణం. గ్రేకలర్‌ది ఎంతో ముచ్చటపడి కొనుక్కున్నారు. ఆదివారం మధ్యాహ్నం కారు లోనే బయలుదేరుతాం."

"ఇంక రాయడం మానేస్తావా ?"

"అబ్బే, ఎల్లా మానాను ? అయినా నాకేం తోస్తుంది ఆ బంగాళాలో ! ఆయన బయటకెళ్తే ఇంట్లో పనికూడా ఉండదు. వంటమనిషిని అప్పుడే కుదిర్చారట, నాకేం పని ఉంటుంది ?"

"మా వాళ్ళు 'అందం—ఆరోగ్యం' అని పత్రిక పెడు తున్నారు. అందులో ప్రతినెలా 'ప్రశ్నలు—సమాధానాలు' శీర్షిక నిర్వహించాలి. ఉత్తరాలన్నీ సరాసరి మీ కోయంబత్తూ రికే పంపుతాము. నువ్వు పెళ్లి చేసుకు వెళ్లినా పత్రికను వదల కూడదు."

"తప్పకుండా రాస్తాను" అంది చంపకం. చంపకం తన పెళ్ళి విషయంలో తల్లి యింత తేలిగ్గా ఒప్పుకుంటుందనుకో లేదు. తల్లి అడ్డు చెప్పకుండా ఒప్పుకున్నందుకు చంపకం మురిసిపోయింది. "నేను కోయంబత్తూర్ వెళ్లినా, అమ్మా అక్కయ్యా యిక్కడే ఉంటారు. మా అన్నయ్య పెళ్లి చేసు కుని తన సంసారంతో ఉంటాడు. అమ్మకి రాజారావుగారు డబ్బు పంపిస్తూండటం నాకిష్టంలేదు. రచనలద్వారా సంపా దించిన డబ్బు ఆమెకి పంపిస్తాను. అందుకైనా రాస్తానుగా!"

"నీకు నెలకి ముప్ఫయిరూపాయలు యిస్తారు. అది మీ అమ్మగార్కి అందే ఏర్పాటు నేను చేస్తాను. నువ్వు మటుకు విధాయకంగా ఆ శిక్షణ నడపాలి" అంది శాంతా దేవి.

చంపకం వాచీవంక చూసుకుంది. బంగారపు చైనుతో చిన్న వాచీ ముచ్చటగా ఉంది. రాజా పచ్చపొదిగిన ఉంగరమూ యీ వాచీ ప్రజంట్ చేశాడు. అయిదుగంటలయింది. శాంతా దేవి దగ్గిర శలవు తీసుకుంది చంపకం.

దారిలో రాజాను తల్చుకు నవ్వుకుంది. ఆరుగంటల కల్లా ఆయన వస్తారు. ఇవ్వాళ కమలకూడా వస్తుంది. అందరూ భోంచేసిం తరువాత, ఆయనకి ఇష్టంలేని పేకాట ఆడించాలి. తొమ్మిదింటికి ఏదన్నా సినిమాకి వెళ్ళాలి. అదీ ప్లాను. రాజా రావుగారు తను వాడుకునేందుకు కారు తీసుకోమంటే వద్దంది. కమల రాజా రావు పక్కనున్నప్పుడు తనతో సరిగా మాట్లాడదు. ఎందుచేతా అని ఆశ్చర్యపడుతోంది తనలో తాను. ఇంతలోనే బస్సొచ్చింది.

## ౧౧

కనుచీకటిగా ఉంది. ఇందు లైటువేసింది. "ఈ గది చంపకం వాడుకుంటుందా?" అని అడిగింది కమల.

"రాధ, చంపకం— ఇద్దరిదీని యీ గది. రాధ స్కూలికి వెళ్ళిపోయిన దగ్గిరనుంచి చంపకం ఒకత్తే వాడుకుంటూంది. చంపకం "అన్నీ తనొకత్తెకే కావాలంటుంది. స్నోలు— పౌడర్లూ—" అంది ఇందు.

కమల టేబుల్ దగ్గిర కొచ్చింది. టేబుల్‌మీద రకరకాల టాయిలెట్ సామాన్లున్నాయి. మంచంమీద జార్జిట్ చీరే, జాకెట్టూ వుల్లిపొర కాయితంలో చుట్టిన పొట్లం వుంది. వాటిపక్క రెండు పట్టుచీరెలూ, ఒక జరీ చీరె వున్నాయి. కమల అన్నిటినీ పరీక్షగా చూస్తోంది. "చంపకం అన్ని వస్తువులు తనకే కావాలంటుంది కదూ" అంది యిందుని కదుపుతూ. "మీ అమ్మగారు చంపకం పెళ్ళంటే సంతోషంగా లేదెం చేతో" అంది.

"నాకు తెలియదు" అంది యిందు- రత్నమ్మకి కూతురి పెళ్ళి ముందుగా అయిపోవడం బావుండలేదు. సత్యానికీ కమలకీ ఎల్లాగో ముడిపెడదామని గంగయ్య తొందరపడ్డాడు. ఈ లోపల సత్యం మలేరియాతో మూడు నెలలు మంచమెక్కాడు. ఆ మూడునెల్లూ చంపకం కూడబెట్టిన డబ్బంతా సత్యం మందులకి ఖర్చుచేసింది. రత్నమ్మ కొడుక్కి జబ్బుచేయడం వల్ల తను దగ్గిరుండి కాపాడుకునే అవకాశం లభించినందుకు సంతోషించింది. సత్యానికి పళ్ళూపాలూ బాగా యిచ్చేవారు. సత్యం కొంచెం కోలుకోవడం చూసి చంపకం పొంగిపోయేది. తను కష్టపడి సత్యానికి మందు లిప్పించాననే తృప్తిపొందేది. సత్యం జ్వరంలో కమలకూడా వచ్చి ఉపచారాలు చేస్తూండేది. ఒకప్పుడు వూరుకున్నా మధ్యమధ్య రత్నమ్మ సూటీపోటీమాటలనేది. కమల గుడ్లనీళ్లు కుక్కుకునేది. రత్నమ్మకి కమలమీద అనూయ - అసహ్యం కొంచెంకూడా తగ్గలేదు. అప్పుడప్పుడు కమలకి సత్యంమీద వున్న ఆదుర్దా, ప్రేమా చూసి జాలి పడేది.

సత్యాన్ని రాజారావు రోజూ వచ్చి చూసివెళ్తూండేవాడు. రాత్రిళ్లుకూడా సక్కదగ్గిర వుంటాననేవాడు. కాని రత్నమ్మ వద్దనేది. ఒకనాడు కమలని రాజారావు దగ్గిర హేళన చెయ్యబోయింది రత్నమ్మ — కాని అతను పుల్ల విరిచినట్టు మాటను తప్పించాడు. అప్పటినుంచి ఆమె నోరెత్త లేదు. రత్నమ్మ కమల పెళ్ళి వెనక్కిపోవడం తన విజయం గానూ కమల వోటమిగానూ భావించేది. కమలకు ఇరవై నాలుగోఏడు ప్రవేశించింది. సత్యం జబ్బువల్లనేమీ, బాధల వల్లనేమీ ఆమెలో పూర్వపు చలాకీలేదు. చెక్కిళ్ళు పాలి పోయాయి. కళ్ళు గుంటలు పడ్డాయి. రత్నమ్మ రాధను, యిందునూ "కమలలోని మార్పు కనిపెట్టారా" అని గర్వంగా అడిగేది. చివరికి చంపకాన్ని "కమలతల్లో అక్కడక్కడ తెల్ల వెంట్రుకలు కనపడ్తున్నాయి చూశావా" అని అడిగింది. చంప కం సమాధానం చెప్పలేదు.

ఈ రాత్రి కమల చాలా వుత్సాహంగా వుంది. జాగ్ర త్తగా చూసిన వాళ్ళకి యీ వుత్సాహం వెనక ఏదో కారణం వుందని పిస్తుంది. వంటింట్లో రాధా తల్లీ ఏదో పిండివంట చేస్తు న్నారు. చంపకం యింకా యింటికి రాలేదు. ఇందు కమలని చూస్తూ నుంచుంది.

"ఎందుకల్లా తేరిపార చూస్తావ్ ?" అంది కమల కోపంగా. "మీ అమ్మ చంపకం పెళ్ళివిని పొంగిపోతోంది. డబ్బుగల అల్లుడొచ్చాడని మురిసిపోతోంది."

"అవును, అమ్మకి సంతోషంగా వుంది. చంపకం వెళ్ళి పోయినా మేమూ సత్యం కలిసే వుంటాం..." ఇందు భయపడి ఆగిపోయింది.

"మీ అమ్మ నిన్ను చూసి ఓర్వలేదు. అందరూ తనకు మల్లేనే అనుకుంటుంది. నాకు చంపకాన్ని చూస్తే జలసీ లేదు."

"నీ కెందుకుండాలి. నువ్వు సత్యాన్ని పెళ్ళాడుతున్నావుగా. రాజారావు గారికన్నా సత్యమే మంచివాడు" అంది యిందు అమాయకంగా.

"అవును. సత్యం బావుంటాడు రాజారావుకంటె" అంది కమల పరధ్యానంగా.

"నాకు రాజారావుని చూస్తే పడదు. చంపకానికి మల్లే తనో గొప్పవాణ్ణి అనుకుంటాడు."

"చంపకాన్ని చూస్తే నీకు వొళ్ళు మండదూ!" అంది కమల పొడిగా నవ్వుతూ. "ఈ సీసా ఏమిటీ?"

"అది లవండరుట. చంపకం దూదితో ముంచి మెడమీద ముఖంమీద అద్దుకుంటుంది"

"ఒకమాట – ఇట్లారా"

"అబ్బ – నాకు భయంగావుంది"

"వెర్రి వేషాలెయ్యకు ఇలారా" కమల చంపకం మంచంమీద కూచుంది. ఇందు పక్కస్టూలుమీద కూచోపోయింది. చెయ్యితగిలి టేబుల్ మీదవున్న కమల హాండ్ బాగ్ కిందపడింది. ఇందు భయంగా "చెయ్యితగిలి పడిపోయింది కోపం తెచ్చుకోకు" అంది.

కమల చిరాకుతో బాగ్ తీసుకుంది, లోపల ఏదో సీసా వెతుకుతోంది.

"సీసా పగిలిపోయిందా ?" అని ఇందు ఏడుపు పర్యంతం అయింది.

"ఏడవకు. సీసా పగల్లేదులే— కొప్పడను" అంది కమల.

"ఆ సీసా ఏమిటి ?"

"ఈ సీసా చిన్నవాళ్ళకు పనికొచ్చేది కాదు. చంపకం ఎప్పుడూ ఏదో మొహానికి రాసుకుంటుందా ? మీ యింట్లో కల్లా చంపకం అందగత్తె అంటారుగా ?"

"రాధ చంపకం కంటె బాగుంటుంది. ఏం నేమటుకు అందంగా లేనూ ?"

"పాపం, నీ కెప్పుడూ చాకిరీతోనే సరిపోతుంది. నీ చేతులు చూడు ఎంత మోటుగా వున్నాయో, తల చింపిరిగా వుంది పిచ్చిపిల్లా !"

"నీళ్ళో నెరసిన వెంట్రుకలున్నాయి—"

"[illegible] అశ్రద్ధవల్ల నెరవదు. ఇంకా కారణాలు వుంటాయి. చంపకం షోకు చేసుకుని రాజారావ్‌కి ఎదురు వెళ్లిందు[illegible] ఇప్పుడు పైకి వస్తుందికదూ ?"

"[illegible] రాజారావు వొచ్చేవేళకి చాలా హడావుడి చేస్తుంది.

[illegible] సేపు అద్దందగ్గిర కూచుని దిద్దుకుంటుంది. మొన్న [illegible] [illegible]ంగా లేదన్నాడని మూతి ముడుచుకు కూచుంది. ఒకసారి క[illegible]మీద చీమకుట్టి వాచింది. అతను చూస్తే అస

హ్యాంచుకుంటాడని కిందకే రాలేదు. అతను కూచుని కూచుని కోపంవచ్చి వెళ్ళిపోయాడు."

"వాళ్ళిద్దరూ దెబ్బలాడుకుంటూంటారా ?"

"అప్పుడప్పుడు"

కమల హాండ్ బాగ్ మూతతీస్తోంది—వేస్తోంది. రెండుసార్లు ఇందుతో మాట్లాడబోయి ఆగింది. ఇందు కెందువల్లనో భయంగా వుంది. కమల కిందికి వస్తే బాగుండునని అనుకుంటోంది.

"చంపకాన్ని ఏడిపించడం నీకు సరదాయేనా ?" ఇందు తలెత్తి చూసింది.

"వూరికే తమాషాకి చంపకం లవండరుసీసాలోని లవండరు పారబోసి నీళ్ళుపొయ్యి. పోనీ లేకపోతే నా దగ్గరున్న సీసాలోది పోస్తావా ?" అడిగింది కమల.

"అది నీకా—వద్దూ !

"నా కింటికెళ్లేదాకా అవసరం లేదు. చంపకం వచ్చేవేళ అవుతోంది."

"దాని సామానులు నేను ముట్టుకోను బాబూ"

"చంపకానికి నువ్వు ముట్టుకున్నట్టు తెలియదు. ఈ సీసా బయట పారెయ్యి"

"ఆ పని నువ్వే చేయరాదూ ?"

"లేదు—నువ్వే చేయ్యాలి. చెయ్యకపోతే నీతో మాట్లా[illegible], రేపు పెళ్ళయింతరువాత నిన్ను మావగ్గిర వుంచు[illegible] లేదా ?"

"అందరికంటె నన్ను బా.గా చూస్తావా ?"

"తప్పకుండా. సత్యంగూడా బాగా చూస్తాడు."

"మీ దగ్గిర సన్నూ అమ్మనే వుంచుకోవాలి – ఇంకెవ్వరూ వద్దు."

"సరే మరి – కలుపు గబగబా" ఇందు లవండను కిటికీ లోంచి బయట పోసింది.

"ఈ మందు దానికి అపాయంకాదు గదా" అని అడిగింది ఇందు.

"అబ్బే ఏంకాదు ! కొంచెం అందం తగ్గుతుంది అంతే_"

కమల కుర్చీలోంచి లేచింది. "నేను గదిలోంచి వెళ్ళి పోయింతరువాత ఆ సీసాలో పొయ్యి."

"బాబోయ్–చంపకానికి తెలిస్తే"

"ఎలా తెలుస్తుంది – నేను చెప్పినట్టు చెయ్యి. ముందు సీసా బాగా ఆ టవల్‌తో తుడు. తర్వాత మిగా సీసాలోంచి పొయ్యి. ఈ పక్క సీసాలోని సెంటుబొట్లు సీసా మూతిక్కూడా పక్కలా చల్లు – ఖాళీసీసా కిటికీలోంచి బయట పారెయ్యి. వింటున్నావా ! నే చెప్పినట్టు సరిగా చెయ్యకపోతే నూ, పెళ్ళయిన తరువాత సత్యాన్ని నీతో మాట్లాడనివ్వను. నే చెప్పినట్టు చెయ్యకపోతే నాకు వెంటనే తెలిసిపోతుంది – జాగ్రత్త_"

కమల గదిలోంచి వెళ్ళిపోయింది. చీకట్లో మేడమెట్ల మీద క్షణం ఆగింది. కింద అడుగుల చప్పుడు. నెమ్మదిగా మెట్లు దిగుతోంది; చివరి మెట్టుదగ్గిర రాధ కనపడింది. రాధ

ముందుగది తలుపు తెరిచింది. గదిలోని కాంతి యిద్దరిమీదా పడింది.

"నీ వంట్లో బాగా లేదా" అని కమలని అడిగింది రాధ.

"బాగానే వుంది."

గదిలో సత్యం రత్నమ్మ ఉన్నారు.

రాధ మేడగదిలో అడుగుపెట్టే వేళకి కిటికీమూసిన చప్పుడయింది. ఇందు వులిక్కిపడి వెనక్కి తిరిగిచూసింది.

"కిటికీతలుపు ఎందుకు తెరిచావ్ ?" రాధ యిందుతో ఎప్పుడూ కటువుగానే మాట్లాడుతుంది.

"అబ్బే– నే తలుపు తెరవలేదు–"

"అంతా అబద్ధం– నువ్వు తలుపు మూస్తుంటే నేను చూశాను. అప్పుడే తెరవలేదని అబద్ధం ఆడుతున్నావ్. చంపకం సామాను లేమన్నా పారేశావా ? చంపకం రానీ చెప్తా !"

"నే నెప్పుడూ దాని వస్తువులు ముట్టుకోను. ఎప్పుడూ నన్ను తిడతావ్" అంది బిక్కగా, కిందికి పారిపోయింది. కమల మిగతావారిని నమ్మకుండా తనకే యీ పని వప్పచెప్పడం, తను బాగా చెయ్యడం యిందుకు సంతోషకారణమైంది.

గుమ్మంలో అడుగుల చప్పుడు. చంపకం చేతులో చెక్కుపుచ్చుకు వచ్చింది. ఆ రోజే జీతం అందుకుంది. రాధను చూసి చిరునవ్వు నవ్వింది.

చంపకం టేబుల్ మీద హాండ్ బాగ్ పడేసింది. తలుపు వేసుకుంది. గబగబా అద్దం దగ్గిరకెళ్ళి మొహం చూసుకుంది.

"నిర్మలంగా నదీకన్యలా ఉన్నావు" అన్న రాజారావు మాటలు జ్ఞాపకం వచ్చాయి. అతన్ని తలుచుకు ప్రేమతో నవ్వుకుం టోంది. జుట్టు దువ్వుకుని జడ అల్లుకుంటోంది.

మెడచుట్టూ బుజంమీద టవల్ చుట్టుకుంది. లవండర్ సీసా కప్బోర్డులోంచి వచ్చిందే! స్పాంజి చేతులో పట్టుకుంది, కింద తలుపు కొట్టిన శబ్దం. ఎవరో తలుపు తెరిచారు. రాజా వచ్చి ఉంటాడు. తొందరగా టాయిలెట్ అవాలి.

స్పాంజిముంచి మెడమీదా బుగ్గలకీ నుదురుకీ లవండర్ రాసుకుంది. ఇంకేముంది? చర్మం మండిపోతోంది – వేళ్ళూ, మొహం కాలిపోయాయి – లవండర్ సీసాలో ద్రావకం పోశా రెవరో. అమ్మో–అని మంచంమీద కూలిపోయింది. "వారిని రానియ్యకు, నా మొహం ఆయన చూడలేరు", అంటూ మొహం కప్పుకొని చంపకం తెలివితప్పి పడిపోయింది.

౧౨

మర్నాటి మధ్యాహ్నం హాల్లో సత్యం ఒక్కడూ కూచున్నాడు. ఎక్కడి సామానక్కడ చిందరవందరగా ఉంది. తల రెండు చేతులకి మధ్య పెట్టుకు కూర్చున్నాడు సత్యం. రాజా రావు క్రిందటిరోజు చంపకానికని తెచ్చిన గులాబీలు వాడి పోయి పడిఉన్నాయి కుర్చీపక్కగా. రత్నమ్మ నిశ్శబ్దంగా ఏడుస్తూ వచ్చి పక్కకుర్చీలో కూలబడింది. సత్యం తల్లిపక్కగా వెళ్ళాడు. "ఇంకా మెలకువ రాలేదు" అంది ఆవిడ. రాధ తల్లిపక్కవున్న కుర్చీలో నిట్టూర్పుతో వచ్చి కూలబడింది.

"మనం యింకా అదృష్టవంతులం" అన్నాడు సత్యం. రత్నమ్మ వెక్కి వెక్కి ఏడుస్తోంది. "ఏమున్నా తింటే మంచిది. రాత్రినుంచి పచ్చి మంచినీళ్ళన్నా ముట్టలేదు" అన్నాడు సత్యం తల్లితో.

ఇందు చినిగిన చీరెతో చీపురుపుచ్చుకు తుడవటానికి వుపక్రమించింది.

"అమ్మా, దాన్ని వూడవడం ఆపమను— నేను భరించ లేను" అంది రాధ.

"ఇందూ— ఆ పని వదిలేయమ్మా. లోపలి కెళ్లి కాఫీ పెట్టవూ— మంచిదానివి కదూ" అన్నాడు సత్యం లాలనగా.

ఇందు బిక్కగా చూసింది.

"మనందరం కష్టాల్లో ఉన్నాం. రాధకి మనసు మన సులో లేదు. నీమీద దానికి విసుగు కాదు" అంది రత్నమ్మ యిందుని చూసి.

"అమ్మా, ఇప్పు డడుగుదాన్ని, నేను దాంతో మాట్లా డను. ఆఖరికి మొహంకూడా చూడను. దాన్ని చూస్తే నా వళ్లు తగలడుతోంది. లోపలికొచ్చి ఏమీ ఎరగనట్టు నటిం చడం— దాన్ని అడుగు చెపుతుంది— అడుగమ్మా అంది రాధ.

"ఏమిటది ?" సత్యం ఉలిక్కిపడి అడిగాడు.

"అమ్మకి రాత్రే చెప్పాను. చంపకం గది కిటికిలోంచి ఏదో పారేసి తలుపువేస్తున్న యిందుని చూశాను నిన్న సాయంత్రం."

"నే పారెయ్యలేదు, నేనేం చెయ్యలేదు."

"తలుపుతియ్య లేదని అబద్ధం ఆడింది. చంపకం సామాను తేవో సర్దించమంటున్నాను" అంది రాధ.

"రాధ అబద్ధం చెప్తోంది. నే నసలు లవండరుసీసా ముట్టు కో లేదు" ఇందు పిచ్చిపిల్లలా అటుస్తోంది.

"వూరుకో యిందూ!" సత్యం గొంతు బిగుసుకు పోయింది.

"ఇదే లవండరుసీసా ఖాళీచేసి ఏదో పోసింది" అంది రాధ.

రత్నమ్మ కుర్చీలోంచి కష్టంగా లేచింది. సత్యంచేతిని వూతం యిచ్చి "అమ్మ మూర్ఛపోతోంది" అన్నాడు ఆదు ర్దాగా. ఇందు గబుక్కున తల్లిని పట్టుకుంది. రాధ కదల కుండా ఉండిపోయింది. తల్లికి తెలివితప్పిందంటే రాధ నమ్మ లేదు. తల్లిని వాలుకుర్చీలో పడుకోబెట్టి సత్యం నీళ్ళకు పరు గెత్తాడు. ఇందు కళ్ళు తుడుచుకుని "నాకేం తెలీదు" అంది. 'ఇందు కళ్ళల్లోని భయం సత్యం చూడలేదా ? లేక తల్లికి మల్లే చూడనట్టు నటిస్తున్నాడా ?' అని రాధ ఆశ్చర్యపోయింది.

"ఇది జరిగినవాటికంటె ఘోరం. ఇంతకంటె కష్టాలు లేవు" రత్నమ్మ సత్యం చేతిని తన చేతుల్లోకి తీసుకుంది. తలుపు చప్పుడయింది. పాపం— రాజారావేమో! కాదు— కమల.

రత్నమ్మ కుర్చీలోంచి లేచి ప్రయాసగా "రాధా, యీ మాట బయటకు పొక్కనీకు. కమలముందు అన్నావా నిన్నింక నా జీవితంలో క్షమించను. నువ్వేం చెపుతున్నావో నీకే తెలి యదు. నీ అక్కను, నువ్వీలాంటి ఘోరం అనడమా ?"

"చంపకంకూడ నాకు అక్కర్యేగా !"

"పాపం చంపకం! అది మన మనిషే. దానికష్టం మన కష్టం కాదూ! పిచ్చిపిల్ల-మొహం చూసుకు మురిసిపోయేది. దాని అందంచూసి మనం గర్వపడేవాళ్ళం."

"చెత్తమాటలూ- పైపై కబుర్లు" అంది గబుక్కున రాధ. వెంటనే రాధకి పెద్దపెట్టున ఏడుపొచ్చింది. ముఖంలో చేతు లుంచుకు గదిలోంచి పారిపోయింది.

"ఇది భరింపరానిది" అంది రత్నమ్మ. కమల వచ్చే వేళకి రాధ లేకపోవడం వొకందుకు మంచిదే. రత్నమ్మకి యీ మాట రాధ బయటమనిషితో చెప్తుందేమోనని భయంగా వుంది. నిజంగా ఆ పని జరిగివుండదు. నమ్మలేనంత ఘోరం, ఆ విషయంగురించి ఆలోచించకుండా మరిస్తే మంచిది. పిచ్చిపిల్ల యిందు కలాంటి మందెక్కడ దొరికింది ? ఇందుకి ద్వేషంగాని కోపంగాని తెలుసా ? తన తోబుట్టువులంటే వెర్రిప్రేమ !

కమల ఓర్పు ప్రదర్శించింది. సత్యం వాళ్ల కష్టాన్ని అర్థం చేసుకుంది. ఇంటిదగ్గిర వంట వొండించి తీసుకొచ్చింది. తల్లి ముట్టలేదుగాని మిగతావాళ్ళు తిన్నారట. రాజారావు వచ్చాడు, గదిగుమ్మంలో గంటసేపు నిశ్శబ్దంగా కూచున్నాడు. చంపకం లేచిన తరువాత రాధ బయటికివచ్చి రాజాను లోప లికి వెళ్లమంది-చంపకం మొఖం మెడా కట్లతో నిండిపోయాయి. రాజా చూడకుండా మొఖం గుడ్డతో కప్పుకొంది. రాజా కొత్తడాక్టర్లని తీసుకొస్తానని బయలుదేరాడు.

సత్యానికి తన సానుభూతి మరోవిధంగా చూపడం చేతకాకపోయింది. రాజా కారులో తనుగూడా ఎక్కి ఆఫీసు

దగ్గిర దించమన్నాడు. మధ్య రెండుమూడు మాటలు మాట్లా డాడు. రాజా ఓపిగ్గా సమాధానాలు యిచ్చాడు. చంపకం– తన చంపకం అల్లా అవకూడదు– బాగుపడుతుంది– అని రాజా మనసులో సమాధానం పెట్టుకుంటున్నాడు.

"ఏం చేస్తున్నావ్" అని అనూంతంగా రాధని ప్రశ్నిం చింది చంపకం.

"ఏడుస్తున్నాను" నిజం చెప్పింది.

"నువ్వు ?"

"ప్రార్థిస్తున్నాను" రాధ వెక్కి–వెక్కి ఏడుస్తున్న శబ్దం వినిపిస్తోంది ! చంపకం ముందెప్పుడూ ప్రేమాభిమానాలు ప్రక టించలేదు. కూచున్న చోటునుంచి కదిలింది. గదిలోంచి పారిపోయి ఒక్క–సారి ఏడవాలనిపించింది రాధకి.

"వాళ్లు చెయ్యాలిసినవన్నీ చేస్తున్నారు. రాజారావు కొత్తడాక్టరుకోసం వెళ్లాడు. ఆ డాక్టరు బాగుచెయ్యగలుగు తాడేమో ! మామూలు మొఖం అవచ్చు– నిరాశ చేసుకో కూడదు– నువ్వు ధైర్యాపడకు" అంది రాధ న్మృదువుగా.

రత్నమ్మ 'అమ్మా – తల్లీ' అని ముద్దుగా చంపకం చేత పాలు తాగించింది. రోజూ తల్లి 'అమ్మా – తల్లీ' అంటూ గారాబం చేస్తున్నట్టు ఆలోచించి ఆలోచించి కన్ను మూసింది చంపకం.

"అవల్లా వుంచు" అంది కమల వంటింట్లో ఇందు పళ్లాలు తీస్తూంటే– "అలా కూచో– నునిన్దరం మాట్లాడాలి– మళ్ళీ అవ కాశం దొరకదు !"

ఇంకా పిచ్చిగా నవ్వుతూ కూచుని "ఈగలు వాల్తున్నాయ్" అంది.

"జాగ్రత్త లేకపోతే యీగలు వాల్తాయ్— ఇటు చూడు ఎవరితోనన్నా లవండరు సీసాలో ఆ మందు పోసినట్లు చెప్పావా?"

"లేదు— నేను ఎవ్వరితో ఒక్కమాటకూడ చెప్పలేదు— నువ్వు చెప్పద్దన్నావుగా?"

"ఎవరూ ప్రశ్నలు వెయ్యలేదూ?"

"రాధే అల్లరి పెడుతోంది" కమల ముఖం వివర్ణమైంది. "ఎంత బెదిరించినా చెప్పకు. చెప్పావా నిన్ను మా దగ్గిర వుంచుకోను. నీకేం తెలియదనీ, నువ్వేం చెయ్యలేదనే మాటలు పట్టుకొక్కుచున్నావంటే చాలు. ఒక్కమాట పైకి పొక్కిందా నీ పని అయిందే."

"కానీ-నువ్వే నన్ను చెయ్యమన్నావుగా?"

"నిన్ను ఏపనీ నేను చేయమనలేదు" అంది కమల నెమ్మదిగా. "అంతా అబద్ధం, నేనేం చెయ్యమనలేదు. నేను చెయ్యమన్నానని అనుకున్నావు. ప్రతిదీ అల్లాగే వూహిస్తావు. నీకు మతి స్థిమితం లేదు. ఇప్పుడోసారి ఎవరో వెంటబడ్డారని నాతో చెప్పావు. ఎవ్వరో నిన్నుపడ్తారని వూహించావు. అంతే కాని ఎవరూ లేరు. నీ బుర్రలో పిచ్చి ఆలోచనలు పుడ్తూంటాయి. అందువల్ల నేను చంపకం లవండరు సీసాలో ఆ మందు పోస్తున్నానని అనుకున్నావు. చంపకం గదిలోకి వచ్చి వూరికే నీతో కాస్సేపు మాట్లాడి అందుకే వెళ్ళిపోయాను —

తర్వాత ఆ మందు నువ్వు సీసాలో పోశావు. నువ్వెందుకు పోశావో నాకెల్లా తెలుస్తుంది? అసలు నీకే తెలియదను కుంటా పాపం."

"అయితే నాకామందు ఎక్కడినుంచి వచ్చిందంటావు" అంది యిందు.

"నీకే తెలియాలి - నాకెల్లా తెలుస్తుంది - ఒకవేళ నీకూ తెలియదేమో?"

"నువ్వే యిచ్చావు" అంది యిందు వెర్రిగా. "ఆ సీసా కిటికీలోంచి పారేశాను. పొద్దున్న సీసాకోసం వెతికేందుకు వెళ్లే టప్పటికి రాజా అక్కడున్నాడు."

"నీకు దొరకలేదన్నమాట" అంది కమల నవ్వుతూ.

"కనిపించలేదు - నీకు దొరికిందా?"

"పోతే పోయిందిలే. నేను నీకా సీసా యివ్వనూలేదు- మళ్ళీ తీసుకోనూలేదు. వూరికే ఖంగారుపడకు. నేను చెప్పిం దంతా జ్ఞాపకం వుంచుకుని ఎవరడిగినా నాకేం తెలియదని చెప్పు. లేదా నిన్ను పిచ్చాస్పత్రిలో పారేస్తారు. అప్పుడు నీకు నిజంగా పిచ్చెత్తుతుంది-"

"నిజంగానా కమలా! నువ్వుగూడా అందరితో నాకు పిచ్చెత్తిందని చెప్తావా?" ఇందు వణికిపోయింది."

"నేను చెప్పను- కాని నువ్వే ఆ పనిచేశావని అందరితో చెప్తే వాళ్ళు నువ్వు పిచ్చిదానివనుకుంటారు. అల్లాంటి పనులు పిచ్చివాళ్ళే చేస్తారు. నీకేం తెలియదనిచెప్పు. గదిలోకి ఎందు

కెళ్ళావంటే తల దువ్వుకుంటున్నాననీ, కిటికీ చల్లగాలికోసం తెరిచాననీ చెప్పు. ఏడవకు జాగ్రత్త–"

రాధ సామాన్యురాలు కాదు. మళ్లీ బయటకు లాగుతుంది. కమలకి మనసులో భయంగావుంది. చంపకాన్ని తల్చుకుంటే జాలేస్తోంది. ఇంతపెద్ద గాయమౌతుందనుకో లేదు. ఆలోచనతో కళ్ళు తడబడ్డాయి.

## ౧౩

రాధ భరించలేకుండా వుంది. కావాలని ఎవరో యీ పని చేశారనే బాధ, అనుమానం ఎక్కువగా వున్నాయి. సత్యంతోను తల్లితోను యిందు లేనప్పుడు మాట్లాడాలని నిశ్చయించుకుంది. అమ్మా అన్నా తనని తప్పించుకు తిరుగుతున్నారు. తను గదిలోకి వెళ్ళగానే వాళ్లు తప్పుకుంటున్నారు. చంపకం గదిలోనే తల్లీ తనూ కాస్త కలుసుకుంటున్నారు.

రాజా తీసుకొచ్చిన పెద్దడాక్టరు చంపకాన్ని చూశాడు. దెబ్బలవల్ల, షాక్ వల్ల ఎక్కువ ప్రమాదం వచ్చిందన్నాడు. మొఖంలోని నరాలకు పక్షవాతం వచ్చింది. ఎలక్ట్రిక్ ట్రీట్మెంటు ఏమన్నా పనిచేయవచ్చునన్నాడు. తిరిగి ఎప్పటిలాగ ముఖం అవడం అసంభవం. కాని చంపకానికి మొఖం బాగా అవుతుందనే ఆశ కల్పించాలని చెప్పాడు. ఆశ నిజం అవుతే అవచ్చు. డాక్టరు మాటలువిన్న రాధకి వొళ్లుమండిపోయింది. సత్యం,డాక్టరూ వెళ్తుంటే గుమ్మంలోనిల్చుంది. యిందు చంపకం గదిలో నర్సుతో మంతనాలాడుతోంది. డాక్టర్ కారు వెళ్ళి

పోయింది. అంత పెద్ద డాక్టరు మనకు షేక్ హాండిచ్చాడనే తృప్తితో సత్యం నవ్వుతూ లోపలికొచ్చాడు.

"సత్యం ఒకసారి ఇలారా మాట..." అంది రాధ. ఇద్దరూ ముందుగదిలోకి వెళ్ళారు. రత్నమ్మ అక్కడే వుంది. రాధ తలుపు ఘడియ వేసింది.

"ఏమిటి రాధా?" అన్నాడు సత్యం భయంతో.

"అమ్మా నువ్వూ ... నేను చెప్పేది వినాలి. ఇంక భరించలేను..." అంది.

"అదేమిటి – నువ్వొక్కత్తెవేనా భరించేది. మాకు మటుకు విచారంగా లేదు? ఇది మనందరి కష్టం" అంది తల్లి.

"నిజమే" అన్నాడు సత్యం.

"అసలు ఏం జరిగిందో నాకు చెప్పాలనివుంది."

"రాధా, నువ్వేమంటున్నావో నీకు తెలుసా? అది నీకు అక్కయ్య" అంది తల్లి.

"వుండమ్మా – అంతేనా?" అన్నాడు సత్యం.

"అవును? నేను చూసింది అంతే" అందిరాధ.

"ఒంటిగా గదిలోవుంటే తప్పేముంది? ఇందు చల్ల గాలి కోసం తలుపు తీశానని అమ్మతో చెప్పింది" అన్నాడు సత్యం.

"మొదట్లో ఆ మాట చెప్పలేదు."

"మొదట్లో అది ఖంగారుపడింది. దాని సంగతి నీకు తెలియదూ?"

"నాకు తెలుసు"

"రాధా, ఈ కష్టాలన్నీ మనకే రావాలా ! అట్లాంటి మాటలనకు దాన్ని. పాపం చంటిది - దానికేం తెలీదు" అంది రత్నమ్మ.

"అకారణంగా ఇందు ఆ పని ఎందుకు చేస్తుంది ?" అని సంశయించాడు సత్యం.

"నేను భరించలేను ఇందు నేరంచేసిందని నువ్వా అంటున్నావా ?" అని రత్నమ్మ ఏడు పందుకుంది.

"లేదమ్మా, రాధకు నచ్చజెప్పాలని చెప్తున్నాను."

"నాకు తెలిసింది నేనుచెప్పాను" అంది రాధ.

"అవును అందరికీ మతుల్లేవు. ఎల్లావుంటాయి యింత కష్టంలో ! అయినా యిందు ఇల్లాంటిపని చేసేందుకు కారణం ఏముంటుంది"

"చంపకాన్ని చూస్తే దానికి ఈర్ష్య. ఇందుకు పిచ్చి పుట్టేటంత అసూయవుంది." రాధ పెదిమలు అదుర్తున్నాయి. "నిజం చెప్పాలంటే చంపకాన్ని చూస్తే మనందరికీ జెలసీ."

"పిచ్చిగా మాట్లాడకు" సత్యం మృదువుగా మందలించాడు. "చంపకాన్ని చూస్తే అందరికీ ప్రేమవుంది. ఇప్పుడు ఎక్కువయింది. పాపం అది కష్టంలోవుంది."

"దాని అందంచూసి మనం గర్వపడేవాళ్ళం. ఆ స్నోలూ పౌడర్లూ వద్దేఅని మొత్తుకునేదాన్ని. అవి లేకపోయినా దాని మొఖం కలకల్లాడుతూ వుండేది. రాధ నన్ను చూస్తే మటమట లాడుతోంది. ఇందును చూసినా అంతే. రేపు నిన్నూ అల్లాగే

అంటుందిరా సత్యం. దానికి మనమేం అపకారం చేశామో?"
అంది రత్నమ్మ.

"అసలు అదే చేసిందని నువ్వెందుకు అనుకోవాలి. కిటికీలోంచి ఏదో పారేసిందన్నావ్. నేనూ, రాజా, కమలా యింతమందీ యిల్లూ వాకిలీ అంతా వెతికాం. పారేసిన వస్తువు కనబడలేదు" అన్నాడు సత్యం.

"దాచేందుకు వ్యవధి వుందిగా?"

"నీ డొంకతిరుగుడు నాకర్థమవడంలేదు. ఇందు తెలివి తక్కువది అంటావు- తెలివిలేనిపిల్ల యింత జాగ్రత్తగా చేసి, వుపాయంగా ఆ వస్తువును దాచగలుగుతుందా. అయినా ఇందు మీద అనుమానపడేందుకు కారణం ఏమీలేదు. అల్లాంటి పిల్లకు ఆ మందు ఎక్కడ దొరికిందంటావు?" అని అడిగాడు సత్యం.

"పిచ్చితల్లి-ఏ పాపం ఎరగదు" అంది తల్లి.

"ఎవరన్నా ఎక్కడ నుంచన్నా తెచ్చిచ్చారేమో"
అంది రాధ.

"ఇదంతా గోలగా ఉంది. నేను అసలువిషయం కనుక్కునేదాకా నిద్దరపోను" అంటూ సత్యం గదిలోంచి వెళ్ళిపోయాడు.

రత్నమ్మ లేచింది. రాధకి దగ్గిరగావచ్చి "నువ్వేం చెప్పావో నీకు తెలియలేదు. పాపం, సత్యం బెంబేలు పడిపోయాడు. వాడికి మతిపోతోంది. వోదార్చుకోటానికి బదులు యిల్లాంటి మాటలా! పాపం పిచ్చిపిల్ల ఇందు ఏడుస్తోంది.

ఇంకెవ్వరిదగ్గిరా యిలా అనకు. నామీాద వట్టు. చంపకంతో అనకు" అంది.

"చంపకంతో అనను కాని అమ్మా..."

"ఎవరన్నా, యిందు పిచ్చిదని నువ్వంటూంటే వింటే, మనందరిని వాళ్లు ఏమనుకుంటారు ? మన కుటుంబంమీాద 'పిచ్చి?' అనే ముద్దరపడుతుంది. పాపం, రాజాను చూడు. మంచివాడు కాబట్టి యింకా చంపకాన్ని పట్టుకుదేవులాడుతున్నాడు. మరోళ్ళయితేనా ? అతను యీా మాట వింటే చంపకం గతి ఏంగాను ? యీా వుపద్రవం, దాని ప్రధానం అయింతరువాత జరగడంకూడా ఒక సుగుణమే- "ఇల్లాయితే ఆడపిల్లల పెళ్ళిళ్లు ఎలా జరుగుతాయి ?"

రాధకు వెంకట్రావు జ్ఞాపకంవచ్చాడు. గుండె జల్లుమంది. తల్లి వేసినమాత్ర పనిచేసింది. కిమ్మనకుండా వూరుకుంది.

౧౪

రెండునెలలు గడిచాయి. రాజా చంపకాన్ని చూసేందుకు వచ్చాడు. ఈ రెండునెలలూ రోజూ పొద్దున్నా సాయంత్రం వస్తూండేవాడు. ఇన్నాళ్లూ ఆవిడ మొఖం కట్లుతో నిండిపోయింది ముఖంమీాద ఎప్పుడూ రంగుబట్ట లేసుకువుండేది. వారిద్దరి మధ్యా ప్రేమసందేశాలు నిట్టూర్పులూ అన్నీ జరుగుతూన్నాయి. రాజా చంపకం చేతుల్ని మృదువుగా నిమిరేవాడు. కట్లకి పూర్వం చంపకం ముఖం తల్చుకుని భవిష్యత్ లోకూడా మార్పు ఉండదని అనుకునేవాడు. చంపకం

మొఖాన్ని చేతుల్లో ఉంచుకునేందుకు వొంకులజుట్టును నుదిటి మీంచి పైకి తోసేందుకు వీలయేరోజుకై ఎదురుచూసేవాడు. చంపకం సన్నగా నవ్వేది. ఆ నవ్వుతో రాజాకి తామిద్దరూ సుఖపడతారనే ఆశ కలిగేది.

అతను ఆమె చేతుల్నీ అరిచేతుల్నీ ప్రేమతో తాకే వాడు. ఒకరోజు కట్లవెనుకనున్న ఆమె ముఖాన్నీ, మెడనీ, జుట్టునూ తాకుతాననీ, అవి పూర్వంలాగే ఉంటాయనీ ఆశ పడేవాడు.

ఈ వుపద్రవం ఎల్లా జరిగిందో చంపకం ఎప్పుడూ చెప్ప లేదు. ఎలా జరిగిందని అతను ప్రశ్నించనూలేదు. రాజా రావు ఎవ్వరితో మాట్లాడకుండా సరాసరి చంపకం గదికి వచ్చే వాడు. మధ్యలో రత్నమ్మగాని సత్యంగాని కనపడ్తే చూడ నట్టు తొందరగా గదిలోకి వచ్చేవాడు. ఒకరోజు సత్యం రాజాని హాల్లో కలుసుకున్నాడు.

"పాపం, మీకు చాలా కష్టంవచ్చింది..." అన్నాడు సత్యం. రాజా తెల్లపోయి సత్యం ముఖంవంక చూశాడు.

"మావల్ల మీరు చాలా శ్రమపడుతున్నారు" అన్నాడు సత్యం.

"ఏమిటి!" అని రాజా ఖంగారుగా తలవంచుకు బయ టికి వెళ్ళిపోయాడు.

పక్కనుంచుని చూస్తున్న రత్నమ్మ "అతను ఏంత భావిరా— పాపం అతన్ని చూస్తే జాలేస్తోంది. ఈ కష్టంలో అతను మనకి చాలా సన్నిహితుడయాడు— మనమీద అతనికి

చాలా అభిమానం— ఈ కష్టసమయంలో అతను ఆదుకున్నాడు— చంపకం పెళ్ళయింతరువాత మనకి దూరం అయిపోతాడు" అంది.

సత్యం వులిక్కిపడి "పెళ్ళిగురించి నీతో మాట్లాడాడా?" అన్నాడు.

"అతను ఒక్కమాటన్నా మాట్లాడడు— కాని అతనికి చంపకంమీద ప్రేమ వీసమంతగూడా తగ్గలేదని తెలియడం లేదూ?"

ఇద్దరూ మాట్లాడకుండా వున్నారు— ఈ అనర్థానికి కారణం ఏమిటా అని ఆలోచిస్తున్నారు — కారణం పట్టుపడ లేదు— ఇంట్లో పెద్దడాక్టర్లు, నర్సులు వచ్చేపోయేవాళ్ళ సంఖ్య పెరుగుతోంది— చంపకం విసత్తుతో వాళ్లకి కొంత ప్రాముఖ్యం వచ్చింది.

ఈ మధ్య వాళ్ళింటికి చాలామంది వస్తున్నారు— రంగ నాథం ఆఫీసులోనివారు చంపకాన్ని చూసేందుకు వచ్చారు— ఆమె స్కూలు స్నేహితులు, సంగీతం స్నేహితులు చాలా మంది వచ్చారు— చంపకం కథలను మెచ్చుకునేవాళ్లు అభి మానస్తులుకూడా వచ్చేవారు — శాంతాదేవి చంపకాన్ని చూట్టానికొచ్చి పక్కదగ్గిర కూచుని కళ్ళనీళ్ళు పెట్టుకునేది— వాళ్ళిద్దరూ కాసేపు ఖబుర్లాడుకున్న తరువాత, ఆవిడ కింద కొచ్చి రత్నమ్మచేతులో పందరూపాయల నోటుంచి, "అవస రానికి వాడుకోండి" అని చెప్పి వెళ్ళిపోయింది— రత్నమ్మకి ఇప్పుడిప్పుడే చంపకం విలువ తెలుస్తోంది— రంగనాథం వొచ్చి ఒకసారి చూసి వెళ్ళాడు— రంగనాథం భార్య పెద్ద ఉత్తరం

రాసింది— అందులో రెండువందల రూపాయలకు చెక్కు కూడా వుంచింది. చంపకం వైద్యంలో అశ్రద్ధ చేయద్దని రాసింది. రత్నమ్మకి నాలుగేళ్ళక్రితమంత నిరాధారంగా యిప్పుడు లేమని తెలిసొచ్చింది. ఇంట్లో డబ్బుకి తడుముకోక్కర లేకుండా గడిచి పోతోంది.

కమల తరుచూ వస్తూండేది. ఇంటిపనుల్లో రత్నమ్మకీ యిందుకీ సాయంచేసేది. ఇందు కోతివేషాలు వేసి తల్లికి సాయం చేయకబోయినా రత్నమ్మ కమలకి చేదోడు వాదోడుగా వుండేది. ఈ మార్పువల్ల రత్నమ్మకి కమలమీద పూర్వం వున్న కోపం పోయింది. ఈ మార్పుకు సత్యం సంతోషించేవాడు. కమల చంపకం గదిలోకి వెళ్ళలేకపోయేది.

ఒకనాడు డాక్టర్ చంపకాన్నిచూసి "అమ్మాయికి చాలావరకు నయమయింది. ఇంక పక్కమీదించి లేచి తిరుగుతే మంచిది. ఈ పిల్లకు కథలు రాయడం కదూ యిష్టం — ఏదన్నా నవల మొదలు పెట్టమనండి" అన్నాడు. రత్నమ్మ డాక్టర్ వెళ్ళింతరువాత "తల్లీ ఎన్నాళ్ళు యిల్లా పడుకుంటావు. కిందకి రాకూడదమ్మా !" అంది.

"ఇవ్వాళ కాదు" అంది చంపకం.

"ఎప్పుడన్నా కిందికి రావలసిందేగా ! నువ్వు మామూలుగా వున్నావు. డాక్టర్ చాలామటుకు నయమయింది అన్నారు. నువ్విప్పుడు మామూలుగానేవున్నావు. మొహంలో సుగుణం కనిపిస్తోంది" అంది రత్నమ్మ.

చంపకం మొహంమీద ముసుగు యింకా కిందకు లాక్కుంది. తల్లికి కళ్ళంట నీళ్ళొచ్చాయి. "నీ వంట్లో నెమ్మదించింది-నువ్వు వుత్సాహం తెచ్చుకోవాలి."

తను చచ్చిపోలేదు కాని తను వోడిపోయిందన్న సంగతి వారికి అర్థం అవడంలేదు. యుద్ధంలో వోడిన వీరుడు ఏ కారడ వుల్లోనో కొండల్లోనో దాక్కుంటాడు. చంపకం జీవితంలో ఓడిపోయింది. తన ప్రేమలో తలదాచుకోచూస్తోంది కాని ఆ కోర్కె నెరవేరడం అసాధ్యం.

రాజాకు "నేను లేచాను" అని చీటీరాసింది—

రాధ రాజాను హాల్లో కలుసుకుంది. "ఇప్పుడంతా మీమీదే ఆధారపడివుంది" అంది రాధ.

"చంపకం విపరీతమైన మనిషి. అది మా అందరికిమల్లే వుండదు."

రాజా మొఖం ఆదుర్దాగా వుంది.

"మరీ అసహ్యంగా ఉందని కాదు. అందమయినవాళ్లు గంస్మత్తుగా వుంటారు. అందానికి అంత ప్రాముఖ్యత ఎందుకిస్తారో నాకు అర్థంకాదు. మీ మోహంలో ఆశ్చర్యం కనిపించనీయకండి చంపకానికి" రాధ చెక్కిళ్ళవెంట కన్నీరు రాలింది.

రాజా రాధను యీనాడు అర్థంచేసుకున్నాడు. కృతజ్ఞతతో చూశాడు ఆమెవంక.

"మీకు షాక్ తగిలిందని తెలిస్తే పెళ్ళిచేసుకోదు" అంది.

"ఆ మాట నీతో అన్నదా?" రాజాముఖం కళవళ పడింది.

"ఆమాట నాతో అనలేదు కాని నేను గ్రహించు కున్నాను. చంపకం తన ముఖాన్ని ప్రేమించని వాళ్ళతో సుఖంగా వుండలేదు. మనుషులు ముఖానికంత ప్రాముఖ్యం ఎందుకిస్తారో. వెంకట్రావు అందంకోసం అంత ప్రాకులాడడు."

రాధకీ వెంకట్రావుకీ సంధానం జరిగింది.

"చంపకాన్ని నేను ప్రేమిస్తున్నాను. చంపకం ఎలా వున్నాసరే నేను ప్రేమిస్తాను."

"చాలా సంతోషం. ఆమెని కోయంబత్తూర్ తీసుకు వెళ్తే - సగం బాగుపడ్తుంది. ఈ మనుషుల మధ్యనుంచి, వాళ్ళ కపటనాటకం నుంచి బయటకువెళ్తే మంచిది. డబ్బుతో చాలా మటుకు సర్దుకుపోతాయి. పైకివెళ్ళిమీరు వచ్చారని చెప్తాను." అంది రాధ.

౧౫

రాజా సోఫాలో ఒకపక్క ఖాళీచేశాడు.

చంపకం ఆనాడు కంటిమీద చీముకుడితే ఎంతో బాధ పడి తనముందుకు రాలేదు. తనకెంతో కోపమొచ్చింది. మళ్ళీ చంపకం కొన్నాళ్ళలో మామూలు మనిషి అవుతుంది. ఎంతో అందంగా అవుతుంది. మళ్ళీ ఎంతో సంతోషంగా వుంటారు. చంపకం నెమ్మదిగా వచ్చింది. రాజా రెండుచేతుల్లోకి తీసు కున్నాడు. చంపకం నుదురుమీద లేసుపడ్తోంది. కళ్ళు అల్లాగే ప్రేమగా అందంగా వున్నాయి. రాజాకి షాక్ అని పించలేదు.

వెనకటి ప్రేమంతా పొంగి పొర్లుతోంది, పక్కన దగ్గిరగా లాక్కుని కూచున్నాడు.

"చంపకం ! నిన్ను నేను ప్రేమిస్తున్నా. నన్ను నువ్వు ప్రేమిస్తున్నావా ?" అన్నాడు.

"ప్రేమిస్తున్నా" అంది నెమ్మదిగా.

రాజా ఆమె కళ్ళవంక చూస్తూ "వొచ్చే నెలలో మన పెళ్ళి. మామయ్య తొందరపెడ్తున్నారు. పెళ్ళి చేసుకుని నిన్ను తీసుకెళ్ళిపోతా. అక్కడ సుఖంగా వుండవచ్చు."

"అవును. మనం పెళ్ళిచేసుకుంటే" అంది విచారంగా.

"ఏ మభ్యంతరం ?" అన్నాడు రాజా. చంపకం అతని ముఖాన్ని తన రెండు చేతుల్లోకి తీసుకుంది. ఆమె వ్రేళ్ళు మరీ మృదువుగా వున్నాయి. కళ్ళు కరుణాపూరితంగా ముసుగు లోంచి చూస్తున్నాయి.

"నాకు అభ్యంతరంలేదు. మనం పెళ్ళిచేసుకోబోయేట్టు, కోయంబత్తూర్ వెళ్ళేటట్టు నటిద్దాం. అంతా సెటిల్ అయి నట్టే నటిద్దాం."

"అంతా సెటిల్ అయింది, నటించడమేమిటి ?

వాళ్ళిద్దరూ పెట్టబోయే కోయంబత్తూర్ కాపరాన్ని గురించి మాట్లాడుకుంటున్నారు. పూర్వం రాజా—క్షణక్షణానికి నువ్వు రంభలావున్నావు—అనేవాడు. ఆ మాట యిప్పుడు అన లేకుండా వున్నాడు.

"నేను రంగురంగుల మేలిముసుగు కట్టుకుంటాను. ముసుగు వెనుకనుంచి నా నవ్వు అందమైన పెదిమలలోంచి

వచ్చినట్టు మీారు వూహించుకోవచ్చు. నా ముఖంకూడా అందంగా వుందని సంతృప్తిపడవచ్చు. కాని యిరవై నాలుగు గంటలూ ఆ ముసుగులో వుండటం కష్టం" అంది ఆలోచనగా చంపకం.

రాజా హృదయం ఏడ్చింది. జాలిగా ఆమె చేతిని నిమిరాడు. చంపకం నవ్వింది. "ఈమధ్య నాకు చాలా నవ్వొస్తోంది. పక్క-మీాద పడుకుని నాలో నేను నవ్వుకునేదాన్ని. చుట్టూ మనుషులు విచారిస్తూ వోదారుస్తూంటే నాకు నవ్వు ఆగేది కాదు."

"అవన్నీ యిప్పుడు మాట్లాడుకోవద్దు" అన్నాడు రాజా.

"ఎప్పుడన్నా ముసుగు తియ్యాలిసొస్తే ఎట్లా?" చంపకం మళ్లీ అందుకుంది.

"ఏం తీస్తే? నేను నీ భర్తను."

"నేను పూర్వంలా వుండను. మనిద్దరం నటిస్తున్నాము."

"ఎల్లావున్నా నే నెప్పుడూ నిన్ను ప్రేమిస్తాను."

"అల్లా అనకండి. మీారుగూడా అందరికిమల్లే అబద్ధాలాడితే నాకు అసహ్యం వేస్తుంది. పచ్చి అబద్ధం."

"క్షమించు. పూర్వంమాదిరి అందంగా వుండకపోతే కొంచెం కష్టంగానే వుంటుంది—ఐనా నిన్ను ప్రేమిస్తున్నాను."

"మీా కెప్పుడూ నా ముఖం చూపించాలని లేదు. చూపిద్దామని వచ్చాను. కాని మళ్ళీ చూపించాలని లేదు నాకు..."

"పిచ్చిపిల్లా, ఏమిటో చెప్పు?"

---

చంపకానికి తమ ప్రేమ కృత్రిమంగా వుండటం యిష్టం లేదు. రాజాతో - "నా ముఖం మీకు చూపేందుకు భయ పడ్తున్నాను" అంది.

"నా ప్రేమను నమ్మలేవా?"

"నమ్ముతున్నాను."

చంపకానికి ముసుగు తీయడం యిష్టంలేదు. సరదా తీసింతరువాత బాధతో అసహ్యంతో కూడుకున్న రాజా మొహం వూహించుకుంటోంది. ఆగకుండా కన్నీళ్ళు వస్తు న్నాయి.

"మీరు నన్ను ప్రేమిస్తున్నారని తెలుసు. మీ ప్రేమని సూర్యుడు ఉదయిస్తాడా లేదా అని శంకించడం లాంటిది. కాని రోజూ నన్ను చూస్తూ భరించగలరా? ప్రేమతో ఆశతో నా వంక చూసే మీ కళ్ళు ఈ వికృతాకారం చూడగలవా? నా ముఖం ఒకప్పుడు బయటవారికి సౌందర్య సందేశం చెప్పేది. అద్దంలో చూసుకుంటే నా ముఖం నాకే ముద్దొచ్చేది. జీవి తంలో అన్ని కోర్కెలూ, ఆశలూ కెరటాలలా కొట్టుకు పోయాయి. మిగిలింది ఈ ముఖం."

"కాదు—ప్రేమకూడా."

"అవును నాకు తెలుసు. మీరు నేను బాగుండనని ఎందుకు చెప్తారూ? చాలామంది కురూపులు నిర్భయంగా రోడ్లమ్మట వెళ్తూండటం చూశాను. భర్తలు వాళ్ళని ప్రేమతో చూస్తారంటే ఆశ్చర్యపడేదాన్ని. నా అందాన్ని పోల్చుకు కురూపిగా వుండటం ఎంత అసహ్యం అని ఏవగించుకునేదాన్ని.

కురూపులు వాళ్ళ వికారాన్ని చూసి సిగ్గుపడాలని అనుకుం టూండేదాన్ని. మీరు అబద్ధాలాడరని నా నమ్మకం. నా వెనుకటి ముఖాన్ని మరవగలరా? మన ప్రేమలోని ఆ మచ్చని తుడిచెయ్యగలరా?"

"ఏడవకు రాణీ, నీ ముఖంకంటె హృదయం ప్రధాన మైనది.

"మీరు నిజంగా నా ముఖాన్ని చూసి గాయపడకుండా నా ఆత్మని సూటిగా చూడగలుగుతే మనం పెళ్ళిచేసుకు సుఖ పడ గలుగుతాము. జీవితంలో ఎవ్వరూ పొందలేని ఆనందాన్ని అనుభవిస్తాము. కాని అది సాధ్యమా?"

"అవును" అన్నాడు రాజా.

"అసహ్యమైన యీ ముఖాన్ని మీరు భరించగలరా?"

"నువ్వు అసహ్యంగా ఎందుకుంటావ్ చంపకం?"

"నేనంత వికారంగా ఉండకపోవచ్చు. కాని దానితో నాలాంటివాళ్లు తృప్తిపడరు-సౌందర్యం లేనిచోట ప్రేమ ఎలా నిలుస్తుంది? ఈ వెలితి తీరేదికాదు. మీతోకలిసి నేను జీవించ లేను. మనిద్దరం మనుషులం. నన్ను దగ్గరకు తీసుకు ముద్దాడిన మీ చేతులూ నా ముఖవికారాన్ని యిరవైనాలుగు గంటలూ భరించగలవా?" ఆవిడ కంఠం జీరపోయింది. వెంటనే మృదు వుగా "చూడండి" అంది. రాజా ముసుగు తొలిగించాడు. గడ్డంక్రిందా, కుడి కణతమీదా, ముడత లున్నాయి. కుడి కనుబొమ్మనుంచి కుడిచెవి వెనక్కి-దాకా పొడుగాటి మచ్చ వుంది. మెడమీద పెద్ద మచ్చ. నుదురు ముఖ్యంగా యీ శిథిలంలో అందంగా కనిపించింది. రాజా చంపకంచుట్టూ చేతు

లేశాడు. మొఖంవంక చూడకుండా దగ్గిరగా మరీ దగ్గిరగా లాక్కున్నాడు.

"ఇంత వికారంనుంచీ, యీ శిథిలంనుంచీ మళ్ళీ అందం వస్తుందా? మామూలు ముఖంనుంచి మార్పు ఎవరన్నా ఆశించవచ్చు. ఒకప్పుడు అందమైన ఈ ముఖం యిప్పుడు—అసహ్యంగా." అంది సిగ్గుతో. "మీరు మునుపటికంటె ఎక్కువగా ప్రేమిస్తున్నారని తెలుసు. మీరు జాలిపడితే నా కిష్టంగా వుంటుంది. మన ప్రేమని నీచంగా అసహ్యంగా మురికిలోకి లాగకూడదు. నా గర్వాన్నీ అహంభావాన్నీ మరవలేనంత గొప్పగా ప్రేమిస్తున్నాను. నేను జీవితంలో సాధారణ వస్తువులు పొందటం మీకు బాగుండదు. నేను గొప్ప వస్తువులు పొందాలని మీ ఆశయం. నా గర్వం, నా అహం చితికిపోయాయి. వెనకటి చంపకం కాదు మీ పక్క కూర్చుంది. ఈ కురూపివల్ల మీకేం సుఖం లభిస్తుంది? ప్రేమించుకుంటున్నామనే భ్రమలో నిజం మరవకండి.

నిశ్శబ్దంలో రాజాకళ్లు కిందకివాలి, చంపకం కళ్ళను కలుసుకున్నాయి. చంపకం తేజస్సులో రాజా ఓడిపోయాడు. ఇంక చంపకానికి చెప్పేది లేదు.

౧౯

రాజాకి కమలే చంపకాన్ని అందవికారిగా చేసిందని గట్టినమ్మకం. కమల పగపడుతుందేమోనని మొదటినుంచీ భయపడుతూనే వున్నాడు. చంపకాన్ని ముందే వారించాడు. కాని ప్రయోజనం లేకపోయింది. కమల అసూయ తన జీవి

తాన్నీ చంపకం జీవితాన్నీ నాశనంచేసింది. రాజా తన అను మానాన్ని చంపకంవద్దగూడా బయటపెట్టలేదు. అంతా మన సులోనే అణుచుకున్నాడు. మధ్యాహ్నం ఆఫీసులో కూచు న్నాడు. జీవితం శూన్యంగా కనిపించింది. చంపకంనుంచి మనసు మరల్చుకోలేకుండా వున్నాడు.

గుమాస్తా వచ్చి ఎవరో ఆడవాళ్ళు తమని చూడాలం టున్నా రన్నాడు. ఆడవాళ్ళెవరబ్బా! రత్నమ్మా?

రత్నమ్మ కాదు-కమల!

కమల ముఖం భయంతో కందిపుంది. మనిషి ఈ నారం రోజుల్లోనూ చాలా చాలా డస్సిపోయినట్టు అనిపించింది.

"రత్నమ్మగారు కబురేమన్నా చేశారా?"

కమల పక్క-కుర్చీలో కూర్చొని, "లేదు. వాళ్ళింటికి వెళ్ళివస్తూ మీ ఆఫీసు దారిలో వుందికదా అని చూసి వెళ్ళామని ఇక్కడ ఆగాను" అంది.

"మా ఆఫీసు మీ యింటికి వెళ్ళే దారిలో వుందా?" హేళనగా అడిగాడు రాజా.

"అల్లా హేళన చేయకు. రత్నమ్మగారి యింటికి బస్సు దింపే నీకు మనశ్శాంతి కలుగుతుందేమోనని వచ్చాను — నన్ను నమ్ము. జరిగినదానికి చాలా విచారించాను. పాపం, నీ జీవితం ముళ్ళలో పడింది. బాగుపడేందుకు నా శక్తికొలది పాటుపడదామని నా కోర్కె..."

రాజా కమల మనస్ఫూర్తిగా బాధపడుతోందని క్షణ కాలం అనుకున్నాడు. "నా గురించి నువ్వు విచారించి లాభం లేదు. నువ్వు చెయ్యగలిగింది ఏసం ఎత్తుకూడా లేదు."

"ఇంత విచారంలో యీ పరిస్థితుల్లో నిన్ను యిలా నిరాధారంగా వదలడం ఎలా ?"

"నాకు సంతోషం పోయింది. నువ్వు చెయ్యగలిగిందల్లా నాతో మాట్లాడకుండా వుండటమే. నేను ముఖ్యంగా స్త్రీలతో మాట్లాడతగినవాణ్ణి కాను. ఈ దరిద్రుడిదగ్గిరి కెందుకొచ్చావ్ ? నేను ఏమైపోయానో నీకు తెలియదు." కమల కదలకపోవడం చూసి ఆశ్చర్యపడ్డాడు.

"మీా ప్రధానం విచ్ఛిన్నమైందని నాకు తెలుసు" అంది కమల నెమ్మదిగా.

"అయితే ఎందుకొచ్చావ్ ? నువ్వుగాని—సత్యంగాని పరిస్థితులు సక్కపెడదామని ప్రయత్నిస్తున్నారేమో — అది వృథా."

"నే నందుకు రాలేదు. వచ్చేనెల్లో కోయంబత్తూరు వెళ్తున్నావా ?"

"ఆ—" రాజా కోటూ హాటూ తీసుకు తప్పించుకు పోవాలని ప్రయత్నిస్తున్నాడు.

"ఒక్క నిమిషం ఆగవూ ?" తలుపుకూ రాజాకు మధ్య జంతువులాడూకి నిల్చుంది. "నీతో మాట్లాడాలి. నేను చాలా బాధల్లో వున్నాను. ఇతరులకికూడా కష్టాలుంటాయని వూహించ లేవూ ?"

"వాటికీ నాకూ సంబంధం ఏమిటీ ? ఆబాధలన్నీ సత్యం తెలుసుకో తగ్గవాడు."

"అదే కష్టం."

"ఏమిటది?"

కమల అసహ్యంగా నవ్వింది. "సత్యాన్ని పెళ్ళి చేసుకుంటానని వొప్పుకున్నా - అందుచేతనే యీ బాధ. అతన్ని చేసుకోవడం నా కిష్టంలేదు. నే నెవరితోనన్నా చెప్పాలి."

"సత్యంతో చెప్పుకో."

"నన్ను వెక్కిరించకు. నా గుండె బద్దలవుతోంది. నేనా పని చెయ్యలేను."

"నాలుగు సంవత్సరాల క్రితం అతనితో నీకు ప్రథానం జరిగింది-ఆలోచించుకునేందుకు వ్యవధి చాలా వుందనుకుంటా. అయినా అది నాకు సంబంధించింది కాదు. అందులో యీ సంగతి నువ్వు నా దగ్గిర చెప్పడం అనవసరం."

"ఎప్పుడూ ప్రతి విషయానికీ ఆశ్చర్యపడ్తున్నట్టే నటిస్తావ్! నామీద నీ కీ నిర్దయ ఎందుకు? మనిద్దరం చాలా విచారంలో వున్నాం. నిన్ను సంతోష పెట్టేందుకే యిక్కడికి వచ్చాను." ఆవిడ కళ్ళు ఎర్రగా ఆకలిగా వున్నాయి. చెయ్యి అతనివేపు జాచింది.

"నన్ను వెళ్ళనీ" అన్నాడు రాజా.

"నన్ను కోయంబత్తూర్ నీతో తీసుకెళ్ళు." రాజా ఆమెవంక తెల్లబోయి చూశాడు.

"నీ మీద ప్రేమ పూర్వంకంటె హెచ్చింది. విధి మనిద్దర్నీ మళ్ళీ ఒకచోటుకి తీసుకొచ్చింది. చంపకాన్ని నువ్వు పెళ్ళిచేసుకోలేవని నా అంతరాత్మ ఎప్పుడూ ఘోషించేది. లోకులు నువ్వు చంపకాన్ని మోసగించావని దూషిస్తున్నారు.

ఆ మాటలు నాకు లెక్క-లేదు. నాకేదో మందుపెట్టి వశీకరణ చేసుకు నీ చుట్టూ తిప్పుకుంటున్నావ్. నీ అందానికై ప్రతి వస్తువుని తృణీకరిస్తాను. నిన్ను పెళ్ళిచేసుకోమనికూడా కోరను-నీ వెంట రానియ్యి-అదే చాలు. అప్పుడప్పుడు నిన్ను చూస్తూ వుంటా. తర్వాత..." కమల ముఖంలో స్త్రీత్వం, శోభ అన్నీపోయి మోటుగా వుంది. అతని రెక్క- పట్టుకుంది.

"నాకు చీదరెత్తిస్తున్నావ్!" రాజా తల పక్క-కు తిప్పు కున్నాడు.

కమల నిర్లక్ష్యంగా నవ్వింది. "ఇద్దరం నిరాశలో వున్నాం. నువ్వు ప్రేమించిన స్త్రీని పోగొట్టుకున్నావ్ - నేను ప్రేమించినవాణ్ణి చూస్తే నాకు గిట్టదు. మొదటినుంచి సంసారాన్ని చూస్తే నాకు అసహ్యం. నాన్నా అన్నయ్యలు ఒత్తిడిచేసి నన్నీ పెళ్ళికి వొప్పించారు. పెళ్ళి కాకుండానే ముసలిదాన్ని అయి పోతానేమోనని భయపడి యీ పెళ్ళికి వొప్పుకున్నాను. మనం జరిగినవాటిని మర్చిపోదాం. పోనీ నిన్ను మర్చిపోమనను. యవ్వనంలో వున్న ఆడది పెళ్ళిచేసుకోమని వస్తే, నిన్ను అవ మానపరచడం కాదేమో!"

"ఈ మాటలు నేను వినలేను. నువ్వెప్పుడూ అసహ్యం గానే ప్రవర్తిస్తుంటావు."

కమల వణికిపోయింది. చేత్తో నోరు నొక్కు-కుంది. మొఖం వివర్ణమైంది. నవ్వుతూ పందెంవేసి గెలిచినట్టుగా "చంపకం యిప్పుడున్నంత అసహ్యంగా లేనేమో!" అంది.

రాజాకి ఆ మాటలు సుత్తిదెబ్బల్లా తగిలాయి. "నువ్వే చేశావ్. ఆ భూతానివి నువ్వే" అని అరిచాడు.

కనుబొలకళ్లు కిందికి వాలాయి. చివరి ఆ ఆయుధంకూడా పనిచేయలేదు. వోడిపోయింది. గోడవైపు చూస్తోంది.

"నువ్వు తొందరగా కదలకపోతే గెంటిస్తాను." అరి చాడేగాని-రాజా కళ్ళలోంచి కన్నీరు కారుతోంది. కమలను అతను మనిషిలా భావించలేదు.

"నన్ను అకారణంగా నిందిస్తున్నావ్" అంది.

"మళ్ళీ సిగ్గులేకుండా వెనక్కి-వెళ్ళి అందింది పొందాలని నీ వుద్దేశం. నా కోసం నీఆత్మని అమ్ముకున్నావు. సత్యానికి నీ నిజరూపం చెప్తాను. నీ నేరం బయటపెడ్తాను."

సత్యానికివన్నీ చెప్పాలని నీ వుద్దేశ మనుకుంటా. నాకు వ్యతిరేక మయినమాట ఒకటికూడా నమ్మడు. పైగా ముందు నిన్ను జాగ్రత్తగా వుండమంటాడు."

"అతన్ని పెళ్లిచేసుకునేందుకు ప్రయత్నించావా-చంప కాన్ని నాశనం చేసింది నువ్వేనని చెప్తాను."

"సత్యం నీ మాట ఒక్కటికూడా నమ్మడు. అతనికి నామీదే నమ్మకం" చాలా నిశ్చలంగావుంది కమల గొంతుక. "మా యిద్దరిమధ్య వచ్చి సత్యం జీవితాన్ని నాశనం చేద్దామని నీ వుద్దేశం. మా యిద్దరినీ ఎప్పటికీ వేరుపరచలేవు. మా కుటుం బానికి నువ్వు యిప్పటిదాకా చేసిన హానిచాలు. నాకూ సత్యానికీ నిన్ననే పెళ్ళయింది."

నాలుగేళ్ళు గడిచాయి. అవి సంక్రాంతి రోజులు. చంపకం చూసిన డాక్టరుని చూడకుండా, చేసిన వైద్యం చేయకుండా ఉంది. నాటుమందులు వాడింది. ఇంగ్లీషుమందులు వాడింది. చాలాడబ్బు ఖర్చుచేసింది. గుణంమాత్రము స్వల్పం.

కుడిచంపకీ నుదుటికీ మధ్యవున్న చర్మం లాక్కు-పోయింది. ఎంతమంది డాక్టర్లకి చూపించినా గుణం లేక పోయింది. ఎవరో గవళ్ళ ముసలిది మందిచ్చి నూనెతో మర్దనచేస్తుంది అంటే - అక్కడ మందు పుచ్చుకుంటోంది. ప్రతిడాక్టరు చంపకానికి ఏ ముప్పైఏళ్లో వుంటాయని అనుకునే వాళ్ళు. చంపకానికి తనకు నిజంగా ఇరవైనాలుగేళ్ళని చెప్పాలని వుండేది. చంపకానికి పూర్వం మాదిరిగానే తన దేహం మీద అభిమానం తగ్గలేదు. ఒకరోజు గవళ్ళ ముసలిది :

“అమ్మగారి ముఖంలో వచ్చినప్పటికంటె ఇప్పుడు బాగా గుణం వుంది” అంది. చంపకం అద్దంలో చూసుకు నవ్వుకుంది. ప్రతిడాక్టరు ఇల్లాగే అంటాడు; ఆ మాటలు నమ్మమంటారు.

“ఇంకో మూడునెల్లు ఇల్లా నూనె రాయించుకుంటే పూర్తిగా తగ్గుతుంది. చిన్నతనంలో మీరుచాలా అందంగా వుండేవారనుకుంటా ?”

“అవును” అంది చంపకం “ఈ నెలాఖరు అయింతరువాత యింక మానేస్తాను. నాకు యితర ఖర్చులు చాలా వున్నాయి. మా అక్కయ్య విశాఖపట్నం హాస్పిటల్‌లో

వుంది. అమ్మ దానిదగ్గిర వుండాలి. ఈ మూడేళ్ళనుంచి వాళ్ళ ఖర్చు నేనే భరిస్తున్నాను. నాకు వలకమించిన ఖర్చులు." ఇదంతా అనవ ర సంభాషణ అని చంపకానికి తెలుసు. కాని ముసల్దాని సానుభూతి మాటలు వినడం చంపకానికి సరదా.

"మూడు నెలలకు వందరూపాయలు చాలుతాయండి. అందరి దగ్గిరా నెలకు ఏభై తీసుకుంటున్నా, అంతడబ్బా వొక్కసారి వద్దులెండి. మీ దగ్గిర వున్నప్పుడే యివ్వండి" చంపకంలోని దౌర్బల్యం డాక్టర్లు నిముషంలో కనిపెడ్తారు. చంపకానికి ఏ నాటికన్నా అందం తిరిగి రాకపోతుందా అన్న ఆశ ఎక్కువ. సరేనని వప్పుకుంది. మందు రాయించుకుని యింటికి వచ్చింది.

చంపకం ఒంటిగానే వుంటోంది. చిన్న మేడమీద పైభాగం అద్దెకు తీసుకుంది. ఈ యిల్లు శాంతాదేవి యింటికి నాలుగోది. చంపకం తనకి సాయంగా ఒక ముసలామెను దగ్గిరకు తీసింది. పగలూ రాత్రీ ఆ ముసలావిడ ఇంటికి కాపలా వుండేది.

ఇందుకి పిచ్చి అని నిర్ధారణ అయింది. మూడేళ్ళనుంచి వైజాగ్ హాస్పిటల్‌లో వుంటోంది. మద్రాసులో తనదగ్గిర వుంచుకోవడం చంపకానికి యిష్టంలేదు. తల్లిగూడా యిందును కనిపెట్టుకు వైజాగ్‌లోనే వుంది. ఇందుకు పిచ్చి అని లోకులకి తెలియదు. రంగనాథం భార్యకు, ఆయనకు, శాంతాదేవికి తప్ప మరెవ్వరికీ తెలియదు. ఏదో రోగిష్టిపిల్ల, ఎప్పుడూ ఆస్పత్రిలోనే వుంటుంది అనుకునేవారంతా. ఇందుకీ తల్లికీ అయే ఖర్చంతా చంపకమే భరించేది. రాజా కోయంబత్తూర్

వెళ్ళిన నెల్లాళ్ళకు కమల సత్యాన్ని వివాహమాడింది. సత్యం ఉద్యోగంలో-మనిషిలో ఏమీ మొత్తమైనా మార్పు లేదు. సత్యానికి ఒక ఆడపిల్ల.

రాధ వెంకట్రావుని పెళ్ళాడింది. వెంకట్రావు యుద్ధం రాగానే దండులో చేర్డాడు. వాళ్ళకి యిద్దరు పిల్లలు. రాధ వెంకట్రావు యుద్ధంలో జేరినప్పటినుంచి పిల్లల్ని పెట్టుకు పక్క గ్రామంలో వుంది. వెంకట్రావు సంక్రాంతికి నెల్లాళ్ళ శలవు పెట్టి వచ్చాడు. రాధకి మూడో సారి గర్భిణి.

యుద్ధం రావడంతో రంగనాథం రెండుచేతుల్తో డబ్బు సంపాయించుకుంటున్నాడు. రంగనాథం బావమరిది యుద్ధంలోకి వెళ్ళాడు. రంగనాథం పత్రికా, శాంతాదేవి పత్రికా రెండింటి బాధ్యతా చంపకం నెత్తిన పడింది. 'అందం – చందం' పత్రికకు చంపకం ఎడిటరయింది. యుద్ధంరోజుల్లో అందరికిమల్లే నే చంపకానికి రాబడి పెరిగింది. 'విద్యార్థి'లో ఎప్పటి మాదిరిగా ప్రశ్నలూ ఉత్తరాలూ చిన్నకథలూ యిలాంటివి రాస్తూండేది. రంగనాథం చాలా దయగా వుండేవాడు.

ఒకనాడు చంపకం ఆఫీసులో పనిచేస్తూంటే రంగనాథం గదిలోంచి మాటలు మాటలుగా మాటలు వినిపిస్తున్నాయి. చంపకం ఏదో మేటరు తయారుచేస్తోంది. శాంతాదేవి ఎందుకో ఆఫీసు కొచ్చింది. మాటల మధ్యలో చంపకానికి "రాజారావుగూడా యుద్ధంలో జేరాడట. మొన్న బెంగుళూరులో మా ఆయనకు కనిపించాడట. ఆమన రాశాడు" అని వినపడింది – రాజా మాట వినేటప్పటికి చంపకం గుండె ఝల్లుమంది. చెవులు నిక్కబొడుచుకు వింది.

"రాజారావు యింత ధైర్యంగా విమానదళంలో చేరతాడనుకోలేదు. అసలు అతని స్వభావం కప్పదాటువేసేరకం— కోయంబత్తూర్ బిజినెస్ సాకు జెప్పి వూసుకుంటాడనుకున్నా" అన్నాడు రంగనాథం.

ఈ నాలుగేళ్ళలో రాజా వొక్కసారన్నా రంగనాథం గుమ్మం తొక్కలేదు. రంగనాథం కొడుకులిద్దరూ విమాన దళంలో చేరారు. రాజారావు ఆయన కొడుకుల్ని కూడా కలుసుకోక పోవడం – చంపకాన్ని వివాహం చేసుకోక పోవడం యీ కారణాలవల్ల ఆయనకు రాజారావుమీద కొంచెం కోపం వచ్చింది. – శాంతాదేవికి వీళ్ళందరికంటె రాజా నిజ స్థితి బాగా తెలుసు. పెళ్లికి వొప్పుకోనిది చంపకం అని ఆవిడకు స్పష్టంగా తెలుసు. శాంతాదేవి తప్ప ప్రతివాళ్లూ రాజా చంపకాన్ని మోసం చేశాడనుకునేవారు. ఈ మూడేళ్ళనుంచి శాంతాదేవికీ, చంపకానికీ స్నేహం ఎక్కువయింది. సాధారణంగా రెండురోజుల కోసారి అయినా కలుసుకుంటూండేవారు. చంపకానికి శాంత పత్రికలో నూటయాభై యిచ్చేవారు. రంగనాథం పందరూపాయలు యిచ్చేవాడు. తల్లికి ఇందుకే నెలకి ఇరవై అయిదు రూపాయలు పంపుతూండేది.

చంపకం చేతిలో డబ్బుకి లోటు వుండేది కాదు. మంచి పట్టుచీరెలు కట్టేది – ఇందుకు జబ్బు నిర్ధారణ అయినతరువాత రత్నమ్మ, యింటూ వైజాగ్ వెళ్ళిపోయారు. చంపకం పూర్వం యిల్లు ఖాళీచేసి శాంత యింటికి దగ్గరగా మేడమీద భాగం తీసుకుంది. కింద యింటివాళ్ళు వుండేవారు. సత్యం యింట్లో పాత్ర సామానంతా తన సంసారానికని తీసుకున్నాడు.

ఇందుకి తల్లికి డబ్బు పంపుతానని వృత్తి త్తి మాటలు చెప్పాడు. చంపకానికి కొత్తయింట్లో పూర్వస్మృతులను పైకిలాగే వస్తువ ఒక్కటి వుంచుకునేందుకు గూడా యిష్టంలేదు. తల్లి యిచ్చిన యినప మంచంగూడా సత్యానికి యిచ్చింది. గెన్నె చెంబూ కుర్చీలూ - బల్లలూ అన్నీ స్వంతడబ్బుతో కొనుక్కుంది. చంపకం పొద్దున్నా సాయంత్రం సొంతడాకట్టిన రిక్షాలో ఆఫీసుకు వెళ్ళేది. సినిమాలకిగూడా రెండో ఆటకు వెళ్తూండేది. సాధారణంగా పగలు బైటికి వచ్చేదికాదు. పూర్వంసల్లే స్నేహితులు గూడా లేరు. ఒక్క శాంతాదేవే వచ్చిపోతూండేది. చంపకం రచనలు మెచ్చుకొని చాలామంది ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతుండేవారు. 'అందం - చందం' పత్రికలో చంపకం అందాన్ని గురించి యిచ్చే సమాధానాలలో పైన ఆమె పూర్వపు ఫోటో తప్పకుండా వుండేది. చంపకం ఆ ఫోటోను చూసి బాధపడేది.

చంపకం యింట్లో ముఖ్యంగా డ్రాయింగ్ రూములో బీరువాల్లో పుస్తకాలు, అల్మారాల్లో పత్రికలూ చాలా వుండేవి. చంపకం రచనలు మెచ్చుకుని సబ్లిషర్సు చంపకానికి "అభిమానంతో" అని పంపుతూండేవారు. పుస్తకాలు, డ్రాయింగ్ రూములో సోఫాసెట్టూ, టీపాయి యిల్లాంటి సామానంతా వుండేది. చంపకం తరచు ఏదో ఒక పత్రికలో సీరియల్ రాస్తూండేది. రంగనాథం పత్రికలో కాకపోతే ఆయన రికమెండ్ చేసి మరోపత్రికలో వేయిస్తూండేవారు. ఆయన చంపకాన్ని ఎప్పుడూ 'పాపం-ఆ అమ్మాయి' అని అంటూండేవారు.

చంపకం పూర్వంలా యిప్పుడు తలపైకెత్తి నడిచేది కాదు. ఎప్పుడూ తలవంచుకొనే రోడ్డువెంబడి నడిచేది. చూసే వారికి "ఆలోచిస్తూ–నడుస్తోందా" అని అనిపిస్తుంది. చీకటిపడిం తరువాత ఒంటిగా షికారు వెళ్ళొస్తూండేది. శాంతాదేవి ఆ షికార్లు వద్దని వారించేది. చంపకం "నాలాంటి దానికేం భయం" అని నిర్లక్ష్యంగా నవ్వేది. చంపకం తన సంపాదనలో రెండొంతులు డాక్టర్లకి ఖర్చుపెట్టేది. ప్రతి కొత్తడాక్టరుని చూసేముందు "నాకు అదృష్టంవుంటే యితనివల్ల నా చెంప బాగుపడుతుంది" అని అనుకునేది. కొత్తరోజుల్లో ఒంటిగా రాత్రి ఒంటిగంటా రెండింటిదాకా జరిగిన సంఘటనలనుగురించి తల్చుకు ఏడ్చేది. తన ముఖం అద్దంలోకి చూసుకు పాత మొహాన్ని జ్ఞప్తికి తెచ్చుకునేది. రానురాను ఆ ఆలోచనలు కట్టిపెట్టి కళ్ళమీదకు నిద్రవచ్చేదాకా చదివేది. ఒకొక్క కప్పుడు కథలకి చిత్తురాసేది. లేకపోతే వృత్తరాలు వైప్రుచేసు కునేది. మెదడుకి విరామమిచ్చేదికాదు. ప్రపంచంలో బ్రహ్మాం డమైన యుద్ధం జరుగుతోందనీ, ఎంతోమంది చనిపోతున్నారనీ ఎప్పుడోగాని చంపకం ఆలోచించేదికాదు. స్థూలకాయుడు తన శరీరబరువును మోసే బాధలో వడగళ్ళవాన బాధను, భూకంపం వొత్తిడిని జాగ్రత్తగా అర్థంచేసుకోలేడు. చంపకానికి యుద్ధాన్నిగురించి ఆలోచించే తీరిక లేదు. తీరికవున్నా వార్తలు ఆమె చదివేదికాదు. విమానదాడివల్ల చాలామంది మను షులు ఫలానావూళ్లో చనిపోయారు అని చదివి తనుకూడా ఒకనాడు అలాగే అంతమవుతాననుకునేది. చంపకం యుద్ధాన్ని గురించి ఎంత మరుద్దామనుకున్నా రాజా వున్నాడన్న సంగతి

జ్ఞాపకం రాగానే వొణికిపోయేది రాజా ఎక్కడ చనిపోతాడో అని ఆమె మనసు తల్లడిల్లేది. చంపకం తమరిద్దరూ కలిసి చని పోయేందుకు యిష్టపడేదిగాని రాజా ఒంటిగా చనిపోయేందుకు వొప్పుకునేది కాదు. ఒకవేళ అతను ముందుగా చనిపోయినా ఆమె వెంటనే అతనిని అనుసరించేందుకు నిశ్చయించుకుంది. రాజాకళ్ళని ఆమె మరవగలదా ”

రాజాను యీ పరిస్థితుల్లో కలుసుకోడం అన్న ఆలో చనవస్తే ఎంతో ఏవగించుకునేది. ‘నేనిల్లావుండగా కాదు’ అని అనుకునేది మనసులో. చంపకం తానెప్పుడూ అల్లాగే వుంటా నని నమ్మేదికాదు. తనచుట్టూ వేళ్లాడే మనుషుల అనసరా లకే కాక మళ్ళీ పూర్వం మనిషి అవుతాననే ఆశకూడా వుండేది. మనుషులు తన ముఖాన్నిచూసి ‘యాక్సిడెంట్’ అంటూంటం విన్నప్పుడల్లా చంపకం మనసులో ఏదో లీలగా అనుమానం తోచేది. ఇంట్లో ఉపేక్షించిన ప్రతివిషయంలో ఏదో నిజంవుందని చంపకం అనుకునేది. ఇందు మాటలవల్లా చేష్టలవల్లా ఆమెమీద చంపకానికి అనుమానం కలిగింది. కాని చంపకం తన అనుమానానికి ఆకారం యివ్వలేదు. యిస్తే పిచ్చెక్కదూ ? అప్పుడప్పుడు చంపకానికి తల్లీ, అన్న గార్ల రక్తస్పర్శ బూటకంలా కనిపించేది. వీరంతా తమ అవ సరాలకోసం తనచుట్టూ దేవుళ్ళాడుతున్నారని మండిపడేది. సత్యం డబ్బుకోసం వచ్చినప్పుడు “కమలని నేను పెళ్ళిచేసుకో లేదు. ఆవిడ సిల్కుచీర్లకి నేను డబ్బివ్వలేను” అని సత్యం మీద విసుక్కునేది. చివరకి మళ్లీ డబ్బిచ్చి పంపేది. వెంక ట్రావ్ వస్తే “సిగరెట్లూ, కాఫీహోటల్లూ మానటం దరాకు

తక్కువా" అని గదమాయించేది. "డబ్బు లేనప్పుడు ఇంత మంది పిల్లల్ని కనడం ఎందుకు? వాళ్ళకు శుభ్రమయిన తిండీ బట్టా లేకుండా మాడ్చటం ఎందుకు" అని విసుక్కునేది రాధ మీద. ఇంట్లో వంటావిడమీద ధూములు ధాములు చేసేది.

## ౧౮

రాత్రి ఎనిమిదయింది. చంపకం భోంచేసి డ్రాయింగ్ రూమ్‌లోకి వచ్చింది. వంటావిడ గిన్నెలు కడిగేందుకు వెనక గదిలోకి వెళ్ళింది. చంపకం శుభ్రంగా స్నానంచేసి తెల్లని బట్టలు వేసుకుంది. సెంటువాసన గుప్‌మంటోంది. టేబుల్ లైటు వేసుకు - పక్కన టేబుల్ ఫాన్ పెట్టుకుంది. కిటికీలన్నీ మూసింది. బ్లాకవుట్. తొమ్మిదిన్నర అయేటప్పటికి లైటార్పి పడుకోవాలి. ఇంకో గంటన్నర టైముంది. గడచినరాత్రి తను రాసిన 'సంసారం' నవలలోని చివరిభాగం కాపీ చెయ్యాలి. ఇంకా నాలుగుపేజీలుంది. 'భార్యాభర్త తప్పుల్ని క్షమిస్తుంది. వాళ్ళిద్దరూ ఒకరినొకరు అర్థం చేసుకుంటారు. చివరికి హాయిగా వుంటారు' ఆ నాలుగుముక్కలికి చిలవలు పలవలుపెట్టి నాలుగు పేజీలు చేసింది. అది కాపీచేసి యిస్తే నవలకు వందరూపాయల చెక్కు వస్తుంది. 'సంసారం' కథ మూడునెలలనుంచి 'సుకుమారి' అనే పక్షపత్రికలో పడ్తోంది. ఈ భాగంతో కథ పూర్తి అవుతుంది. పెన్ను పుచ్చుకు కూర్చుంది. తలుపు చప్పుడు. వీధితలుపేనని అనుకుంది. కాదు-మెట్లతలుపే-విసుక్కుంటూ తలుపుతీసింది. సత్యం మురిగ్గావున్న గుడ్డలతో వచ్చాడు. మోటుగా వాలుకుర్చీలో ఫానుదగ్గిరగా కూర్చున్నాడు.

"బాగానే ఉన్నావే."

సత్యాన్ని చూస్తే చంపకానికి కోపం వస్తోంది. అతని మాటలు—చేష్టలు విసుగు పుట్టిస్తున్నాయి. అయినా అన్నగారు కదా అని ఓపిక పడుతోంది.

"బాగానే ఉన్నా. వచ్చిన పనేమిటి? తొందరగా చెప్పు. ఈ రాత్రికి కథ పూర్తిచేసి పడుకోవాలి."

"ఫాన్ గూడా కొన్నావే— కరంటు చాలా అవదూ?"

"యూనిట్ కి పావలా అని నీకు తెలీదూ?"

"తినేందుకేమీ లేదు?"

"నేను ఏడింటికే భోంచేశాను. భోజనానికి రావల్సి వుంటే కబురంపరాదూ?" చంపకం యిల్లా సత్యాన్ని భోజనానికి వచ్చేముందు కబురంపమని అడగడం పదోసారి.

"ఊపిరాడక ఛస్తున్నాను." సత్యం ముఖం దీనంగా మురిగ్గాఉంది. చాలా పెద్దవాడిలా కనుపిస్తున్నాడు. జుట్టు తెల్లబడ్డదప్పుడే. "నిన్ను కలుసుకుందామని అకస్మాత్తుగా అనుకున్నా. నీతో మాట్లాడవలసిన అవసరం వచ్చింది. నిన్ను ఆఫీసులో కలుసుకుందామనుకున్నా."

"ఆఫీసుకంటె యిక్కడే నయం."

"ఇంకా భోంచెయ్యలేదు - ఆకలిగా ఉంది. తింటానికి ఏంలేదూ?"

పక్కనున్న స్టౌమీద కెటిల్ తో నీళ్లుపెట్టి అల్మారలోంచి బిస్కట్లూ ఒక యాపిలూ తెచ్చిపెట్టింది. ఓవల్టిన్ కలిపి ఇచ్చింది. సత్యం గబగబా అసహ్యంగా తాగేశాడు.

"ఇంటికెళ్లలా ?" అని అడిగింది చంపకం.

"వెళ్లాను."

"మరైతే భోజనం ఎందుకు చెయ్యాలా ?"

"కమలకి వంట్లో బాగా లేదు. పనిచేసేది దెబ్బలాడి వెళ్లిపోయింది."

"కమల లేవలేదా ?"

"లేవలేదు. పడిశం పట్టి భారంగా ఉంది. ఇంకో కప్పు ఓవల్టిన్ యియ్యి."

చంపకం లేదందామనుకుంది.

"పాలున్నాయిగా" అన్నాడు సత్యం. "నువ్వన్నీ చక్కగా అమర్చుకుంటావ్."

"రాత్రిళ్లు పన్నెండుగంటలదాకా రాసుకోవాలి. అందుకని ఓవల్టిన్ నాకూడా ఉండాలి." చంపకానికి నిర్మొహమాటంగా మొహంమీద అనడం అలవాటైంది.

"నీ పని హాయిగా ఉంది. నీ ఉద్యోగంలాంటిదయితేనా ?" అన్నాడు సత్యం.

"రాణి బాగా ఆడుతోందా ?"

"రాణిని మర్చిపోయావనుకున్నా. ఇప్పటికన్నా జ్ఞాపకం వచ్చిందే!" సత్యానికి తన మూడేళ్ల కూతుర్ని చూస్తే ప్రాణం. వచ్చినవెంటనే దాని క్షేమంగురించి అడగ లేదనుకున్నాడు. "దాన్ని వాళ్ళ మామ్మదగ్గిర వదిలేస్తాను. పిల్ల బొత్తిగా నలిగిపోయింది. కమల పిల్లనూ సంసారాన్ని సాదుకో లేకుండా

ఉంది. అసలే లేవడంలేదు. దానికితోడు యీ పనిచేసేది మానడం."

"రాణిని ఎప్పుడు తీసుకెళ్తావ్ ?"

"సిగరెట్లున్నాయా?" చంపకం అల్మరలోంచి తీసిచ్చింది.

"నీకీ వెండి సిగరెట్ కేస్ ఎందుకు ?"

"ఇంటికి అలంకారం వెండివస్తువులట. నేను కాల్చనుగా సిగరెట్లు."

సత్యం అగ్గిపుల్లగీసి కిందపారేశాడు. ఎదురుగా యాష్ట్రే వున్నా అతనికా అలవాటు.

"ఇంకా శుభ్రం తగ్గలా !" అన్నాడు చంపకం పుల్ల యేరటం చూసి. "రాధ విషయం నీకు తెలుసుననుకుంటా ?"

"తెలుసు" అంది చంపకం. రాధకి పురుడొచ్చే రోజులు.

"నాలుగేళ్ళలో ముగ్గురుపిల్లలు. అమ్మకి దాని ఆరోగ్యం గురించి భయంగావుంది. నిన్ననే ఉత్తరం వచ్చింది."

"ఊం."

"రాధ చాలా బలహీనంగా వుందట. కిందటిసారి చాలా కష్టం అయింది. అమ్మని రమ్మంటోందిట. ఇంకో సిగరెట్టు యియ్యి."

"తీసుకో. అమ్మ వెళ్తుంది కాబోలు" చంపకానికి మనసులో కష్టంగావుంది. తనని యింట్లోవాళ్ళు పరాయిదానిలా చూస్తారు.

"చెప్పటానికి చాలా తేలిక. ఇందు అమ్మమీద ఆధారపడింది. డాక్టర్లు కావలసినవాళ్ళు పక్కన వుండటం మంచిదన్నారు" అన్నాడు సత్యం. సత్యం కంఠం విచారంగా వుంది. అతను ఎప్పుడొచ్చినా తన కష్టాలు ఏకరువు పెడుతూంటాడు. చంపకానికి వాళ్ళ కుటుంబ బాధలు తనని తినేస్తున్నాయేమోనని భయంగావుంది. ఆఖరికి తన విచారాన్నికూడ వాళ్ళ కష్టాలనుంచి విడిచేశాడు. తన దుఃఖం వాళ్ళు మర్చిపోయారా!

"అమ్మకి రాధదగ్గిర కెళ్ళటానికి అభ్యంతరంలేదు. కాని యింటికి మళ్ళీ వొంటరిగా వస్తే జబ్బు ఎక్కువవుతుందని భయపడ్తోంది. అక్కడే వచ్చింది కష్టం. రాధ నువ్వు అవసరానికి ఆదుకుంటావనుకుంది" అని అందుకున్నాడు సత్యం.

"నాకు రాధని ఎలా చూడాలో తెలియదు, అయినా వెంకట్రావుకి నన్నుచూస్తే అట్టే యిష్టంలేదు. ఇంతకీ రాధ అమ్మనిగా రమ్మంది."

"నేను నిన్ను రాధ దగ్గిరకు వెళ్ళమనడం లేదు. నువ్వో నెల్లాళ్ళు సెలవుపెట్టి, ఇందు దగ్గిర గడుపుతే, అమ్మ రాధదగ్గిర కెడుతుంది."

చంపకం తల వంచుకొంది. సత్యం క్రూరత్వంచూసి చంపకం కొయ్యబారిపోయింది. సత్యం తనకు కావలసిందంతా తీసుకున్నాడు. మొదటినుంచీ తనమాట చెల్లించుకుంటున్నాడు. ఈ సంక్రాంతి చంపకం శాంతగారి పుట్టింట్లో గడుపుదామనుకుంది. ఆ పల్లెటూరిలో తనవాళ్ళని - వాళ్ళ కుళ్ళుని - యీ పట్నాన్నీ మర్చిపోయి చక్కని పైరుగాలి పీలుస్తూ హాయిగా గడుపుదామనుకుంది.

"నాకు ఏడాదినుంచి ఒక్కరోజు శెలవలేదని నీకు తెలుసా? ఎండాకాలంలో రంగనాథంగారికి జబ్బుచేసింది. ఆ తరవాత అంతా పని, పని— క్షణం తీరికలేకుండా పని. క్రిందటి సంక్రాంతికి అమ్మను నీ దగ్గిర వుంచుకోడానికి నేనూ యిందు దగ్గిరవెళ్ళి వున్నాను" అంది.

"నిన్ను శెలవతీసుకోమనే చెపుతున్నాను."

"ఇందుదగ్గిర నేనుండలేను. క్రిందటిసారి వున్నప్పుడు నా ప్రాణంపోయింది."

"అమ్మ యింతకాలంనుంచీ వుండటంలేదూ?"

"అదీ యిదీ ఒకటికాదు. ఇందుకు అమ్మని చూస్తే యిష్టం. వాళ్ళిద్దరికీ సరిపడుతుంది."

"ఒకపని మనం చేసేటప్పటికంటె యితరులు చేస్తే తేలిగ్గా వుంటుంది కదూ?" అన్నాడు సత్యం అధికారంతో.

"కమల వెళ్ళకూడదూ? ఇందుకి కమలను చూస్తే యిష్టం."

"కమల వంట్లో బాగుండలేదని చెప్పడంలే. అది ఇల్లు విడిచి వెళ్ళడం కష్టం. ఇంట్లో రాణి!"

"రాణి వాళ్ళ మామ్మదగ్గిర కెళ్తుందన్నావు?"

"కమల కదలడానికి వీలుపడదు. పనిమనిషి లేదు. బాసిక వంట్లో బాగాలేదు." కమల పనివాళ్ళని ఎంతోకాలం అట్టే పెట్టుకోలేదు. ఇల్లు చిందరవందరగా వుంటూంటుంది. ఒకసారి రాణి చినిగిన గౌనుతో కనబడింది. 'మీ అమ్మ ఏంచేస్తోందే' అంటే 'సినిమాకి వెళ్ళింది' అంది బిక్కగా. చంపకం జాలిపడి

దానికి కొత్తగానూ, పిప్పరమెంట్లూ కొని యిచ్చింది. సత్యం చంపకాన్ని యిందు దగ్గిరకు పంపే ఆలోచన రాధ రాసిం దన్నాడు. అది నిజం అవునో కాదో తెలుసుకోవాలి. రాధకి చంపకానికీ యిందుకీ పడదని తెలుసు.

"రాధ నేను యిందుదగ్గిరకెళ్తే బాగుంటుందని రాసిందా?" అని అడిగింది చంపకం.

"నాకు తెలియదు. ఎవరు రాస్తేనేం? అమ్మ మొదట అనుకుని రాధకి రాసిందనుకుంటా. రాధ అల్లా చేస్తే బాగుం టుందని వొప్పుకుంది."

చంపకం ఆలోచించింది. రాధ చాలా మారిపోయింది. వెంకట్రావుకి చంపకం డబ్బూ - యిల్లూ డాబూ - యివ్వన్నీ గిట్టవు. రాధకూడ నెమ్మదిగా వెంకట్రావుతో కలిసి తనకు దూరం అవుతోంది. ఈ ఆలోచనలు రాధవి కావనుకోడం కొంత నయం. అమ్మ యీ ప్లాను ఆలోచించడం మరీఘోరం.

"రాధ చాలా నీరసంగావుంది. ఈ స్థితిలో వెంకట్రావు దాన్ని వదలివెళ్లడం అంత మంచిదికాదు. కాని అతనికి శలవ లేదుట. అమ్మనాన్న అక్కడవుంటే కొంత నయం. అమ్మ వెళ్లేందుకు నువ్వు సాయంచెయ్యాలి. అమ్మవుంటే పెద్దచేసేది లేదనుకో-" అన్నాడు సత్యం. "ఈ మధ్య యిందుకి మరీ పిచ్చి ఎక్కువయిందట. ఏమన్నా అవుతుందేమోనని అమ్మ భయపడుతోంది."

"నిజంగానా! అమ్మ ఉత్తరం రాసి రెండువారా లయింది" తల్లి ఈ వార్త తనకు తెలియపర్చలేదని లోపల క్షించగావుంది.

అదెప్పుడూ అంతే. డాక్టర్లూ నర్సులూ తనకిశత్రువులని పిచ్చిపిచ్చిగా అనుకుంటుంది. సత్యం యిందుని గురించి జాలి పడటానికి బదులు యిందు జబ్బువల్ల తను ఏదో అవమానం పొందుతున్నట్టు బాధపడేవాడు.

చంపకం కళ్లు నీళ్లతో నిండాయి. ఆవిడ జారిపోతున్నా నని భయపడ్తోంది. కాని అందరినీ చూసి జాలిపడ్తోంది.

"నువ్వు రెస్టు ఎప్పుడన్నా తీసుకుందువుగాని, మన పరి స్థితులు తెలిసిన రంగనాథం మరోప్పుడు శెలవు యిమ్మంటే యిస్తాడు. నువ్వు కాకపోతే యింకెవరెడ్తారు చెప్పు?"

"దానికి నేను రావడం యిష్టం వుండదేమో! నామీద కోపంవస్తే?" అంది చంపకం.

"అబ్బే అదెప్పుడూ అల్లాఅనుకోదు. దానికి తనవాళ్ళ మీద ప్రేమాభిమానాలు చాలావున్నాయి."

తనకు లేవని అర్థం కాబోలు ననుకుంది చంపకం. "ఇలా కాకపోతే మరోవిధంగా నన్ను యిరుకున పెడ్తారు. మీరు పీక్కుతింటున్నారు. వెళ్ళనూ అని లాభంలేదు. సరే" అంది నిస్పృహగా.

"అల్లా వుండాలి. స్వార్థం వుండకూడదు. ఇతర్లను సంతోష పెట్టడంలోనే మన సంతోషం వుంది" అన్నాడు సత్యం.

"నువ్వు అల్లా చేస్తావా?" అని చంపకం సూటిగా ప్రశ్న వేసింది. చంపకం తనజీవితాన్ని, సత్యం జీవితాన్నీ పోల్చుకు చూసుకుంటూండేది. ఈ నాటికీ సత్యం కమలని

ఎందుకు పెళ్ళిచేసుకున్నాడో చంపకానికర్థమయేదికాదు. డబ్బుకోసం వచ్చినప్పుడే సత్యం యింత వోపిగ్గా మాట్లాడుతాడు. రాధ సమస్యకంటే డబ్బు ఎక్కువ అవసరం కాబోలు.

"డబ్బేమన్నా వుందా ?" నవ్వుతూ చూశాడు.

"ఏం చెప్పను ?" అని తిరిగి కష్టంగా నవ్వింది. "కథ పూర్తిచెయ్యకుండానే వచ్చావు"

"నువ్వు దానిమీదే ఆధారపడలేముగా. జీతం ఏమయింది ?"

"జీతం నూటయాభైలో డెబ్భయి అమ్మకి పంపాను."

"ఇంకో పత్రికలో వంద యిస్తారుగా."

"అద్దె యిచ్చుకోవాలి-అమ్మకీ యిందుకీ గుడ్డలు లేవు. నాకు పండక్కి చీరెలేదు. మరి యింట్లో వాడుకు నేందుకూ?"

"నీకింకా చాలా డబ్బు వస్తుందిగా ?" సత్యానికి కోపం వస్తోంది ! చంపకం రోజురోజుకి చాలా కఠినం అవుతోంది. దానికి కోపం తెప్పిస్తే అసలివ్వదు - కొంచెం తగ్గాడు.

"నిన్ను యిబ్బంది పెడుతున్నందుకు చాలా సిగ్గుగా వుంది నాకు. కాని అప్పులు పెరుగుతున్నాయి. ఈ మధ్య కమల పడుకోడం - పనిమనిషి ఆధ్వర్యం - ఇల్లు గుల్లయి పోయింది."

"విశాఖా యిల్లు చాలా పెద్దది" చంపకం అనవసరం అనుకుంటూనే సత్యం సంసార విషయాల్లో కల్పించుకుంది. "చిన్నయింట్లోకి మార్తే బాగుంటుంది."

"మారుస్తేనే బాగుంటుంది. కమలకి వాళ్ళ నాన్న యిచ్చిన సామాను బోలెడంత వుంది. అది పెట్టేందుకు చిన్న యిల్లు చాలదు" అన్నాడు వోసిగ్గా.

"వాళ్ళనాన్న డబ్బు సాయం చెయ్యరాదూ? అయినా కమల అన్నగార్లు తరుచు మీ యింట్లోనే వుంటారనుకుంటా." చంపకం యెప్పుడోగాని సత్యం యింటికి వెళ్ళదు. వెళ్ళినప్పుడల్లా కమల అన్నలు చీట్లాడుతూనో, ఖబుర్లు చెప్పుతూనో కనిపిస్తూంటారు.

"మా పెళ్ళికి వాళ్ళే సాయంచేశారు. వాళ్ళంటె నాకాట్టే యిష్టంలేదు. కాని కమలకి కష్టందోసించడం అనవసరం. పాపం రాణికి పండక్కి కొత్తగానుండదు"

రాణి అనేటప్పటికి చంపకం కదిలింది. "ఎంతకావాలీ?"

"ఓ యాభై—పోనీ నలభై వుంటేచాలు"

"అబ్బే అంత లేదు. పండక్కి అమ్మావాళ్ళకి బట్టలు కావాలి. పాతికయిస్తా."

"సరేయియ్యి. తొందరలోనే తీర్చుకుంటా" చంపకం అందు అయిదులు అతనిచేతుల్లో పెట్టింది. "సరే నీ నవల పూర్తిచేసుకో. నువ్వు యిందు దగ్గరకు వెళ్ళేందుకు యిష్టపడ్డావని అమ్మకు రాస్తా. నువ్వొస్తావంటే అది పొంగిపోతుంది" అతను వెళ్ళాడు. సత్యం అబద్ధాలాడుతున్నాడని చంపకానికి తెలుసు. ఇందు తను వున్నన్నాళ్ళు బాగానేవుండి, తన వెనుక అమ్మతో, సత్యంతో నేరాలుచెప్తుంది చంపకం కుర్చీలో కూలబడింది. వెంటనే నవల మొదలుపెట్టలేక పోయింది. ఆవిడ నవలలోని భార్యాభర్తలు వెన్నెట్లో అల్లాగేవున్నారు. యింకా

మాట్లాడుకోవడం లేదు. వొకరినొకరు పూర్తిఅర్థంగాంచేసుకో లేదు ఒక్కక్షణం తనుకూడ యిందులాంటి దౌర్భాగ్యురాలేనని అందరూ ఎందుకు మర్చిపోయారా అని ఏడ్చింది.

౧౬

రెండురోజులు గడిచాయి. మూడోరోజు రాత్రి చంపకం ఏదో వుత్తరాలు చూసుకుంటోంది. పగటివేళ తీరిక వుండదు. తలుపుచప్పుడు దడదడా వినిపించింది.

"అబ్బా గోల" అనుకుంటో తలుపుదగ్గిర కెళ్ళింది. బయట వర్షంకురుస్తోంది. తలుపుతీసింది. వెంకట్రావ్ నిలువునా తడిసి ముద్దయివున్నాడు.

"ఎంతసేపటినుంచో కొడుతున్నా" అన్నాడు విసుగ్గా.

అతనికోపం, ఖంగారుచూసి రాధకి సుస్తీగా వుందేమో నని చంపకం భయపడింది. "రాధకి వంట్లో బాగా లేదా ?"

వెంకట్రావు తడికాళ్ళు కార్పెట్‌మీద విదిలిస్తూ "ఎంతపిల్చినా పలకవేమిటి ?" అన్నాడు మొరటుగా.

"రాధ కులాసాగా వుందా" అంది ఆదుర్దాగా.

"ఏం ? హాయిగావుంది"

చంపకం వాళ్ళనుండి గిరుక్కున వెనక్కి తిరిగింది. వెంకట్రావు వెనకాలే వచ్చి రైన్‌కోటు పక్కనే తగిలించ బోయాడు.

"కార్పెట్ తడుస్తుంది. అలా మెట్లవైపు తగిలించు" అంది చంపకం.

వెంకట్రావు విసుగ్గా కోటు బయటవుంచి లోపలి కొచ్చి కుర్చీలో కూలబడి యికిలిస్తూ "నా పిలుపు వినపడ లేదూ!" అన్నాడు.

"నేను ఏదో రాసుకుంటున్నాను. వినిపిస్తే తియ్యనూ!"

రాధకోసమన్నా వెంకట్రావుని మర్యాద చెయ్యాలి. చంపకం ఎప్పుడూ ఎవరికోసమో ఒకరికోసం ఏదోఒకటి చేస్తూంటుంది. తనకోసం మాత్రం యీ జన్మకేమీ చేసుకో దేమో!

"ఏదో బాగానేవుంది. కొత్తపుస్తకం రాస్తున్నావా!"

"అవును" అంది నవ్వుతూ. రాధకోసం వెంకట్రావుతో మాట్లాడాలి. మళ్ళీ యుద్ధంలోకి వెళ్ళిపోతాడు. "ఏదో చిన్న పుస్తకం— ఆరునెలల్లో పూర్తయింది. రంగనాథంగారు పుస్త కంగా అచ్చేయిస్తారట."

"చాలా డబ్బొస్తుందనుకుంటా."

"మొదటిసారి రెండొందలు—తరువాత వేసినప్పుడల్లా వంద."

"రెండేసిసార్లు డబ్బిస్తారూ ఒక్కొక్క దానికి! బలే అదృష్టం. నాకు రాయడం వస్తేనా!" వెంకట్రావు కళ్ళు చంపకాన్ని తినేసేటట్టు చూస్తున్నాయి.

చంపకానికి ఆ చూపు యిబ్బందిగావుంది. "అంత పెద్ద డబ్బు రాదు. అయినా నేను రాసేవి ఏమంత గొప్పవికావు."

"అట్లాంటివి గట్టిగా చదివేందుకుకాదు. మొన్న రాధ కూడా ఆమాటే అంది. చదవాలంటే యింకా చాలా మంచి పుస్తకాలున్నాయి. నాకూ రాధకీ నీ రచనలు ఆట్టేనచ్చవు."

చంపకం నవ్వింది.

"నవ్వాకు. నేననేదేమిటంటే, నీ రచనల్లో స్త్రీత్వం ఎక్కువ వుంటుంది. అది నాకు ఎక్కువ నచ్చదు."

"నేను స్త్రీనికాదూ ? అన్నట్టు రాధకి అమ్మ సాయం వస్తుందిగా"

"రాధకి వాళ్ళమ్మ రావాలనివుంది. ఇల్లాంటి సమయాల్లో దానికోర్కె చెల్లించడం మంచిది" అన్నాడు వెంకట్రావు.

"ఇతర సమయాల్లో అయితే ?"

"కొన్ని వేళల్లో పురుషుడే జడ్జి అవుతాడు. నీకు పెళ్ళి అవలేదు. అందుచేత సంసారంలోని లోతుపాతులు తెలియవు"

వెంకట్రావుమాటలు చంపకానికి నచ్చలేదు. అతన్ని వెళ్ళిపొమ్మని చెప్పుదామనిపించింది.

"నాకాట్టే టైములేదు. నేను రాసుకోవలసింది బోలెడంతవుంది. నువ్వొచ్చిన కారణం తొందరగా చెప్పు, ఓకప్పు ఓవల్టిన్ తాగుతావా ?"

"ముందు ఓవల్టిన్ యియ్యి"

కెటిల్ స్టౌవ్ మీదవుంచి పక్కగదిలోకి వెళ్ళింది చంపకం. ఆమెకి వెంకట్రావుతో మాట్లాడటం యిష్టంలేదు. అందమయిన తన వేళ్ళవంక చూసుకుంది. మనుషులు తను ఆడదనీ, తనకు కోర్కెలుంటాయనీ మర్చిపోయారు. ప్రతివాళ్లు తనింకా వికారంగా అయిపోయి, ఇంకా కష్టపడి స్వార్థం లేకుండా డబ్బు గణించి వాళ్ళకు పెట్టాలని ఆశించేవారే. వాళ్ళకి టైముంటే తననుగురించి జాలిపడుతుంది. మెడ్రాసులో

ఈ యుద్ధం రోజుల్లో తను ఒంటిగా వున్నానని ఒక్కరికీ కష్టం లేదు. శాంతమటుకు చంపకం రాత్రింబవళ్ళు ఒంటరిగా వుండ కూడదని దెబ్బలాడి ఈ ముసల్దాన్ని కుదిర్చింది. శాంతాదేవి వొక్కతే తనమనసుని అర్థం చేసుకుంటుంది. తల్లికి ఇందును గురించి బాధడటంలోనో సత్యం గొప్పవాడుకా లేదని విచారించ డంలోనో పుణ్యకాలం గడిచిపోయింది. వాళ్ళందరికీ సంసా రాలు, ప్రేమాభిమానాలు వున్నాయి. వారి ఆనందాల్లో, రహస్యాల్లో, కేరింతాల్లో తనకి భాగం లేదు. వారికష్టాల్లో, దరిద్రంలో తనకు భాగం తప్పకుండా ఇస్తారు. తనకు దయగాని ప్రేమగాని చూపించారా ? తన దగ్గిరనుంచి డబ్బు లాక్కు న్నారు. మొదటినుండీ నాశనం చేశారు. చిన్నప్పుడు వాళ్ళంతా కూరా పప్పూ వేసుకుతిని సాయంత్రం ఆఫీసు నుంచి ఆవురావురుమంటూ వచ్చేవేళకి పచ్చడిమెతుకులు మిగిల్చేవారు. ఆ రోజుల్లో రాధన్నా తనపక్షం. ఇప్పుడు ?... అయిపోయినవన్నీ కెలకడం అనవసరం. ఆఖరికి తన మొఖం పాడైనప్పుడుకూడా ఎవరివల్లనా అని తను ఆలోచించ లేదు.

ఇప్పుడు వెంకట్రావు వచ్చాడు. బహుశా అప్పుకోసం వచ్చివుంటాడు. తనదగ్గిర డబ్బులేదు. వుంచుకునే లేదన్నా ననుకుంటాడు. రాధకోసం అన్నా యివ్వాలనిపిస్తుంది. వెంక ట్రావు మళ్లీ సైన్యంలోకి వెళ్ళిపోతాడన్న జాలిపుల్ల తను మెత్తబడి రొంపిలోకి దిగుతుంది. ఊహు. తనువున్న నిజం చెప్తుంది. శాంతాదేవి చెప్పినట్టు నాలుగుడబ్బులు వెనకేసు కుంటుంది. ధైర్యంగా యివ్వననంటుంది, గదిలోంచి బయట

కొచ్చింది. రెండుకప్పుల నోవల్టిన్ తయారుచేసింది. ఇద్దరూ తాగారు. చంపకం ప్రశ్నార్థకంగా చూసింది.

వెంకట్రావు కనిపెట్టాడు. నే వచ్చినసంగతి చెప్తాను. రాధా నేనూ యిబ్బందుల్లో వున్నాం. అదిచాలా నీరసంగా వుంది."

"పాపం, అమ్మ వస్తోందిగా."

"అది నాకు తెలుసు. ఎప్పుడూ ఏదో యిబ్బంది వుంటూనే ఉంటుంది. నవ్వుతున్నా వెందుకూ ? నువ్వేనయం. ఎప్పుడూ తుళ్ళుతూ నవ్వుతూ ఉంటావు. ఈ సంసారం, బాధ్యతా ఉండవు. ఎవ్వరినీ లెక్కచెయ్యక్కర లేదు."

"అవును – బాధ్యతలు లేవు నాకు"

"ఇంట్లో చాలా యిబ్బందిగావుంది. ఇంటివాడికి మూడు నెలల అద్దెయివ్వాలి. వొత్తిడి చేస్తున్నాడు" వెంకట్రావు నాలిక కొరుక్కున్నాడు.

"కిందటి నెల అద్దె రాధకి ఎం. ఒ. చేశానే!" అంది చంపకం ఆశ్చర్యంగా.

వెంకట్రావు పప్పులో కాలేశాడు. తనతప్పు తెలుసుకున్నాడు. "దానికి మూడునెలల అద్దె బాకీ అని తెలియదు. ఒక్కనెలే అనిచెప్పాను. తెలుస్తే బాధపడుతుంది. దానికి తెలియకుండా నీదగ్గిర పుచ్చుకు సర్దుదామని."

"రాధకి సాయంజేసేందుకు నాకేం అభ్యంతరం లేదు, కాని యిప్పుడు నాదగ్గిర డబ్బేది ? – ఎంతకావాలేమిటి ?"

"యిరవై రూపాయలు. నీకు అదో లెఖ్ఖలోదా ? నీకేం డబ్బుగలదానివి, మాకయితే అదే పదివేలు."

ప్రతివాళ్ళు 'మేము' అంటారు.

సత్యం, కమలనీ-రాణిని కలుపుకు "మేము అంటాడు. అమ్మ యిందునీ- సత్యాన్ని కలుపుకు 'మేము' అంటుంది. వాళ్ళంతా తనొక్క-దాన్నే వెలేశారు. వాళ్ళ హృదయాల్లో, రక్తబంధాల్లో తనకి భాగంలేదు. తనకి కష్టాల్లేవు. ఆలోచన లేదు. హృదయంలేదు. యంత్రంలా కష్టపడి పనిచేసి వాళ్ళం దరి యిబ్బందులూ తీర్చేందుకేనా బ్రతకటం! ఈ నాలు గేళ్ళలో సత్యం తనతో అబద్ధాలాడి చాలా డబ్బుతీసికెళ్ళి తగలేయడం చూసింది. పైగా అధికారం చెలాయిస్తా డప్పు డప్పుడు. వెంకట్రావుకూడా రాధకి తెలియకుండా తగలెయ్య డంచూసి తెల్లబోయిం దిరోజు. "అద్దెవాళ్లు కొన్నాళ్ళు ఆగ లేరూ? మొన్నరాత్రే సత్యం డబ్బు అప్పుపట్టుకెళ్లాడు. పెట్టె ఖాళీ అయిపోయింది."

"చాలా అసహ్యంగా వుంది. సత్యం తనడబ్బు తగ లెయ్యడమే కాకుండా నీ దగ్గిరకూ వస్తాడూ?" అన్నాడు వెంక ట్రావు. రాధ సత్యాన్ని గురించి భర్తదగ్గిర దాచకుండా అన్నీ చెప్పింది. వెంకట్రావు దృష్టిలో సత్యంవాళ్ళు కాస్త కింద వాసిలో వుంటారు. "డబ్బు అప్పుకొచ్చేటప్పటికి వాళ్ళూ మేమూ ఒకటే అనుకుంటున్నావా?" అన్నాడు కోపంగా.

"నీకు చెప్పకుండా వుండాల్సింది. చెప్పకపోతే వుంచు కుని యివ్వ లేదనుకుంటావని చెప్పాను."

"వుంటే నువ్విస్తావని నాకు తెలుసు. నీ డబ్బంతా మీ వాళ్ళకే సరిపోతుందని రాధ నాతో చాలాసార్లు అంది. అందుకే పదేపదే అడగనివ్వదు నన్ను."

చంపకానికి కాస్త తేలిగ్గావుంది.

"ఈసారి పరవాలేదని చెప్పాను. నువ్వేంపరాయిదానివా! సొంత అప్పగార్ని అడగడంలో తప్పేమిటి? నీకు నెలనెలా పుష్కలంగా డబ్బొస్తుందాయె. నువ్వు అడగటం తరువాయిగా ఆఫీసులో ఎడ్వాన్సు యిస్తారు. యిరవైరూపాయలు బకెట్ట నీళ్ళల్లో ఒక్కబొట్టు నీ దృష్టిలో."

చంపకం జారిపోతోంది. రంగనాథం అడ్వాన్సు ఎప్పుడు కావాలన్నా యిస్తూనేవుంటాడు. కాని అంత దయగావుండే ఆయన్ని చెయ్యిజాచి అడగబుద్ధి పుట్టదు. శాంతాదేవి సడుగుతే రేపుపొద్దున్న యిస్తుంది. చంపకం ఆలోచించడం కని పెట్టి వెంకట్రావు తన కష్టాల్ని ఏకరువు పెట్టడం మొదలు పెట్టాడు.

"పోనీ చెక్కురాసియ్యి."

మళ్ళీ మనసు దిట్టపరుచుకుంది. "డబ్బేంలేదు— నే నివ్వలేను" అంది.

"ఇవ్వలేవూ!—ఇట్లాచూడు. నువ్విస్తా వనుకుంటున్నా, యిందాకటినుంచి."

"నే నివ్వలేను—నాదగ్గిర లేదు."

"వూరికే యిమ్మంటున్నానా? అప్పు అడుగుతున్నా. తిరిగి యిచ్చేస్తానుగా!"

"వెనక చేబదుళ్లు ఏంతీర్చారు?"

"నువ్వెప్పుడూ అల్లా అంటావనుకోలేదు చంపకం. రాధ నీ సొంతచెల్లెలు."

"కాని దాన్ని ఉద్యోగంలోంచి నువ్వే మాన్పించావు. లేకపోతే యింత యిబ్బంది వుండేదికాదు." వెంకట్రావు నిస్సహాయంగా చూశాడు. చంపకం మాటలకర్థం? రాధని పెండ్లాడాడు - యుద్ధంలో జేరాడు.

"దానికి నెలనెలా డబ్బు పంపిస్తూనేవున్నా. అద్దె చెల్లించేందుకు డబ్బిస్తే తరువాత సర్దుకుంటాం."

"నాదగ్గిర డబ్బులేదు"-చంపకం గట్టిగా అంది.

"ఇంకెవరిననా్నా అప్పడుగు."

"రాధ నీ తోబుట్టువుగదా అని."

"అయితే?...నేను రాసుకోవాలి."

"అవును. నువ్వు రాసుకోవాలి. ఒకపక్క నీ చెల్లెలికి పురుడొచ్చేరోజులు. నీ మరిది యుద్ధంలోకి వెళ్లుతున్నాడు. నేను వూళ్లో లేనప్పుడు అద్దె యివ్వలేదని యిల్లు ఖాళీచెయ్యమంటే? నువ్వేమటుకు డబ్బిచ్చేందుకు అనుమానిస్తున్నావ్."

"నా దగ్గిర లేదని ముందే చెప్పాను. అద్దెచెల్లించే మరీ వెళ్లు. రాధకిమటుకు తెలియనివ్వకు. అద్దె కట్టాల్సిన డ్యూటీ నీమీద వుంది. ఇంక నువ్వు వెళ్ళు."

"నన్ను వెళ్ళమంటున్నావా? నువ్వు నిజంగా అంటం లేదు. వేళాకోళం చేస్తున్నావు. నీ చెల్లెలికి నిలుచుందుకు నీడ వుండదు - అందులో పురిటిరోజుల్లో - డబ్బు ఇవ్వనంటావా? నేను నమ్మను."

"మీకు పంచిపెట్టేందుకా నా సంపాదన?"

"లోకానికి పెద్ద పేరుబడ్డ రచయిత - కథకురాలు, వాళ్ళందరినీ నీ తియ్యటి కథలతో మోసపుచ్చి డబ్బు గుంజు కుంటున్నావు. అసలు జీవితంలో మరుకు చెల్లెలి పురిటి సమ యంలో ఇంట్లోంచి వెళ్ళగొట్టారన్నా డబ్బివ్వనంత నీచు రాలివి. ఆ డబ్బు కట్టుకు పోదువుగాని. నీపాపండబ్బు తిన్న వాళ్ళకి వొంట పడుతుందా?"

వెంకట్రావు కోపంగా వెళ్ళిపోయాడు. వెంకట్రావు వెళ్ళిపోయిం తరువాత యీసారి చంపకం ఏడవలేదు. చీడ పురుగులు గుంపులుగా చేరి పేరు మొక్కని నాశనం చెయ్యడం లోని హింసనీ అసహ్యాన్నీ కళ్ళారా చూస్తోంది. నోటినిండా వెంకట్రావుతో దెబ్బలాడింది.

## ౨౦

రాజారావు కోయంబత్తూర్‌లో వుండగా యుద్ధం ఆరంభమయింది. ఈ నాలుగేళ్ళలో అతను చంపకాన్ని మరువ లేక పోయాడు. తనగృహానికి దీపమని కలలుగన్న చంపకం రూపం అలా నాశనం అయింది. యుద్ధం ఆరంభమయిన మొదటిరోజుల్లో అతను చాలా అశాంతితో బాధపడేవాడు. తన స్నేహితు లెంతోమంది యుద్ధంలో జేరారు. ముఖ్యంగా రంగనాథంగారి అబ్బాయిలుకూడా జేరారని తెలిసిన క్షణం నుంచి రాజా ఒక్కక్షణంకూడా హాయిగా ఉండలేకపోయే వాడు. మామయ్య మాటను తిరస్కరించి విమానదళంలో జేరాడు.

ఆ నాడు రాజా ట్రూప్ బొంబాయిలో ఆగింది. మధ్యాహ్నం హోటల్ నుంచి కాంప్ కి వస్తుంటే ఎవరిదో నవ్వుతున్న మొహం కనపడింది. దగ్గరకొచ్చిచూస్తే రంగనాథం కొడుకు.

ఇద్దరూ వాళ్ళవూరు గురించీ మనుషుల గురించీ మాట్లాడుకున్నారు. రంగనాథం కాలు విరిగి పోయిందట. శాంత భర్తగూడా ఆర్మీలో జేరాడు. ఇప్పుడు ఆఫీసులో చంపకం రంగనాథం మిగిలారు. చంపకం శాంతభర్త నిర్వహిస్తున్న పత్రికకు ఎడిటర్ అయింది. రంగనాథం పత్రికలో సీరియల్సు రాస్తూంటుంది. రాజా చంపకాన్ని గురించి చాలా ఆతృతగా అడిగాడు. రంగనాథం కొడుకు రాజా చంపకాన్ని మోసగించాడని వాళ్లఅమ్మవల్ల విన్నాడు. అయినా అతనికి రాజామీద గౌరవం తగ్గలేదు. రాజా అంత ఆతృతగా అడిగేసరి కి ఆశ్చర్యపోయాడు. చంపకం చాలా కష్టపడి రాత్రింబగళ్ళు పనిచేస్తుందిట. ఒకొక్కప్పుడు ఏదన్నా జబ్బు చేస్తుందేమో నని ఆఫీసువాళ్ళు భయపడ్తూంటారు. చంపకం అక్కగారు ఏదో హాస్పిటల్ లో వుంది. తల్లిని, అక్కగార్ని ఆమేపోషిస్తోంది. రాజా ఆ సాయంత్రం తనకాంపుకి వెళ్ళాడు. సాయంత్ర మంతా అతని మనసు అయోమయంగా వుంది. ఆ రాత్రి చంపకానికో పెద్ద వుత్తరం రాశాడు. తెల్లవారింది. రాజా రావుకి జ్వరం పట్టుకుంది. ఆ జ్వరం టైఫాయిడ్ లోకి దించింది. రాజా చంపకానికి రాసిన వుత్తరం పోస్టులో వెయ్యలేదు.

అతనికి ఒకనెల సిక్ లీవు యిచ్చారు. తిరిగి ఎల్లాగా యింటికెడ్తాడు—అప్పుడు చంపకాన్ని కలుసుకోవచ్చు. శరీరాల కంటె ఆత్మలు వున్నతమైనవి అని చెప్పొచ్చు. తనింకా చంప

కాన్ని పూర్వంలాగా ప్రేమిస్తున్నానని చెప్పవచ్చు. చంప కాన్ని ప్రార్థించి, క్షమించమని కోరవచ్చు.

రాజారావుకి జ్వరం నిమ్మళించింది. ఒకనాడు బెంగుళూరులో రైలెక్కబోతూండగా ఏదో ఎరుగున్న ముఖంలా కనిపించింది. ఆ మనిషి గబగబా వెళ్ళిపోతున్నాడు. రాజా తొందరగా వెంటబడ్డాడు. అతను వెంకట్రావు. రాధ ప్రియుడు. వెంకట్రావుని చూడటంతో రాజాలో పూర్వపుస్మృతులు తిరిగాయి. "వెంకట్రావ్" అని కేకేశాడు.

వెంకట్రావు తిరిగిచూశాడు. మనిషిలో పూర్వపు మృదుత్వం లేదు. చాలా పెరిగాడు. కళ్ళు ఎర్రగా ఉన్నాయి.

"నిన్ను చూట్టం చాలా సంతోషంగా ఉంది" అని చెయ్యూపుచ్చుకు రాజా "ఎల్లావున్నావు – పెళ్ళయిందా ?" అని ప్రశ్నలవర్షం కురిపించాడు.

ఆ–పెళ్ళయింది. ఈ రాత్రి వెళ్ళిపోతున్నా. టైము లేదు. మీరు బాగున్నారా ?

"బాగానేవున్నా. సత్యం వాళ్ళంతా ఎల్లావున్నారు ?"

"చాలా రోజుల కడిగారు" వెంకట్రావు నిర్జీవంగా చూశాడు. రాజా చంపకాన్ని మోసపుచ్చి సందుకు వెంకట్రావు విచారించ లేదు. చంపకానికి శాస్తి బాగా జరిగిందను కున్నాడు. "నేను రాధని పెళ్ళాడాను."

ఇద్దరు పోట్లాడ్లు వెంకట్రావును కేకేశారు.

"నేను వెళ్ళిపోవాలి."

"చంపకం ఎల్లా ఉంది ? ఒక్కక్షణం. ఆమె అడ్రసు కావాలి. ఎక్కడుందీ ?"

"చంపకాన్ని యింట్లో కలుసుకోలేవు. పిచ్చాసుపత్రిలో ఉంది. వెళ్లొస్తా" అని పరిగెత్తాడు.

రాజారావు స్టేషనంతా గిర్రున తిరిగినట్టయింది. చెవుల్లో పెద్ద హోరు. వెంకట్రావు వెంట పరిగెత్తి రెక్కపట్టుకుని "ఎక్కడికెళ్లింది చంపకం ? ఎక్కడుందీ ?" అని ఖంగారుగా గుంజాడు.

"పిచ్చాసుపత్రి కెళ్లిందని చెప్పలేదు ? వార్డు బి. బెడ్ నెంబరు 5. పిచ్చాసుపత్రి, వైజాగ్." అంటూ తొందరగా పట్టు విడిపించుకుని పరుగెత్తి సోల్జర్ల గుంపులో కలిసిపోయాడు.

రాజారావు తనకు తెలియకుండానే స్టేషనుంచి తిరిగి వచ్చాడు. కాళ్ళు అతన్ని టెలిఫోన్ దగ్గిరకు తీసుకెళ్ళాయి. ఫోన్‌లో వైజాగ్‌కి ట్రంక్ కాల్ బుక్ చేశాడు.

"హల్లో – మిస్ చంపకం పున్నయ్య, బెడ్ నెంబరు 5. బి. వార్డు–ఉన్నారా ?

"హల్లో ! సరిగా చెప్పండి – మళ్లీ"

"మిస్ చంపకం పున్నయ్య"

"ఉన్నారు"

"ఎప్పుడొచ్చారు ?"

మళ్లీ బడబడా శబ్దం.

"ఎల్లా ఉంది ?"

"హల్లో – బాగా లేదు. నిద్రపోయారనుకుంటూ. క్షమించండి" మళ్ళీ బరబరా శబ్దం – ఇంకో కంఠం వినపడింది.

"హల్లో...మిస్ పున్నయ్యా, నాకు మిస్ పున్నయ్యకి ఎల్లాఉందో కావాలి."

"నన్ను మీకు చెప్పలేదు ? అంత బాగాలేదు. ఎల్లాయినా అంత బాగాలేదు. ఆవిడ అక్కచెల్లెళ్ళనీ తల్లినీ తప్ప యితర్లని కలుసుకోవడం లేదు. మీరావిడ ఫ్రెండా ? చాలా రోజులయిందా కలుసుకుని, మీకు మంచివార్త చెప్పలేనందుకు విచారిస్తున్నా. బహుశా బాగుపడదేమో. ఆశలు ఆట్టేలేవు...మీకు చూడాలనివుంటే రావచ్చు. కాని చూసి ప్రయోజనం ? ఆవిడ మనలోకం మనిషికాదు. డాక్టరుతో మాట్లాడతారా? మీ మాట వినపట్టంలేదు. కొంచెం గట్టిగా చెప్పండి...అప్పుడప్పుడు ఏడుస్తుంది– నవ్వుతుంది. పిచ్చి... ఏం కుదుకుతుందో ?"

"ఇంకా మీకు టైముకావాలా–" అని ఆపరేటరు అడిగింది. రాజా ఫోనుదగ్గిరనుంచి బయటకు వచ్చాడు. ప్రపంచమంతా అయోమయమైంది. చంపకం...తన చంపకం ఇలా అయిపోయింది. రాజా వైజాగ్ రైలుకి బదులు బొంబాయి రైలెక్కాడు.

ఆరేళ్లు గడిచాయి. చంపకానికి చాలా జబ్బుచేసింది. పరిస్థితులు తారుమారయాయి. ఆఫీసులో రంగనాథం పోయారు. ఆఫీసంతా శాంతభర్తా, రంగనాథం పెద్దకొడుకూ చేతుల్లోకి వచ్చింది. పాతరచయితలందరూ వెనుకపడ్డారు. ఆఫీసులో అన్నీ కొత్త ముఖాలే. చంపకం మటుకు శాంత

భర్త ఎలా రాయమంటే అలా రాసేది. ప్రేమకథ వస్తే - ఏ పురాణాల్లో భాగమో రాయమంటే భారత భాగవతాల్లో దేదో చిన్నకథ తీసుకురాసేది. ఇందు చచ్చిపోయి ఏడాది అయింది. కమలకి రెండేళ్ళ క్రితం నిమోనియావచ్చి చచ్చిపోయింది. రాణీ స్కూల్లో చదువుతోంది. సత్యానికి చంపకం సహాయంతో రాణికి డాక్టరీ చెప్పించాలని ఆశ. చెంచెబ్రావుకి ముగ్గురు పిల్లలు. ఇప్పుడు చింతపండు వ్యాపారం చేస్తున్నాడు. చంపకం దగ్గిరకు యింకా అప్పుడు వస్తూనే ఉన్నాడు.

రాజారావు చంపకాన్ని కలుసుకోలేక పోయిన తరువాత మళ్ళీ విమానదళంలోకి వెళ్ళాడు. మరుసటి సంవత్సరం అతని బట్టలూ, ఒక డైరీ - అందులో చంపకం ఫోటో, అవన్నీవున్న పార్సిలు చంపకం పేరవచ్చింది. డైరీలో "శరీరాల కంటె మా ఆత్మలు గొప్పవి. చంపకాన్ని కలుసుకుంటే యీ మాట చెప్పాలి" అని ఉంది. చంపకం - ఎన్నో రాత్రిళ్ళు ఆ మాట తల్చుకు ఏడ్చేది.

ఆరునెల్ల క్రితం చంపకానికి చాలా జబ్బుచేసింది. ముందు రెండునెలలు అశ్రద్ధ చేసినా మూడో నెలలో లేవలేని స్థితికొచ్చింది. నర్సింగ్ హోమ్‌లో జేరింది. శాంతాదేవి - రంగనాథం భార్యాపిల్లలూ, శాంత భర్త - అంతా చూసేందుకు వస్తూండేవారు. సత్యం, తల్లి, రాధ, ఆమెభర్తకూడా వస్తూండేవారు. డబ్బుకు శాంతావాళ్లు చాలా సాయంచేశారు. చంపకం నర్సింగ్ హోమ్‌లో ఉన్నప్పుడే వెనుకోసారి పల్కరించకుండా పోయిన అదృష్టం తిరిగి మరో రూపంలో తొంగిచూసింది.

చంపకం ధనాన్ని సూదంటురాయిలా ఆకర్షిస్తుందనే వారు వెంకట్రావు. మొదటినుంచీ నా తల్లి అదృష్టవంతురాలే అంది రత్నమ్మ. అందరూ చంపకం అదృష్టాన్ని మెచ్చుకున్నారు.

సేట్ హీరాలాల్ ఎనభైయ్యోయేట చనిపోతూ - విల్లులో ఏడాదికి మూడువేల రూపాయిల రొఖ్ఖం వచ్చే షేర్లు చంపకానికి రాశాడని తెలియపర్చాడు. అతని విల్లుతో పాటు హీరాలాల్ చంపకానికి అందజేయుమని రాసిన ఉత్తరంకూడా జతచేసి పంపాడు వకీలు. అటువంటి గమ్మత్తయిన వుత్తరం చంపకం తన ముప్పైఏళ్ళజీవితంలో ఏ నాడూ అందుకో లేదు.

మూడోనాడు చంపకం శాంతతో కలిసి ఈ పల్లెటూరు వచ్చింది. ఇంటావిడ రాజమ్మ శాంతకి దూరపుచుట్టం, శాంత రికమండేషన్ వల్ల చంపకానికి యింట్లో కొంతభాగం ఇచ్చింది. భోజనసదుపాయాలన్నీ ఆవిడ యింట్లోనే. రాజమ్మకి ఏభై ఏళ్ళుంటాయి. మనిషి మంచి మాటకారి. ఆవిడ భర్త చిన్నప్పుడే పోయాడు. పల్లెటూరిలో వున్నా అడపాదడపా పత్రికలు చదువుతూండేది. చంపకంపేరు పత్రికల్లో చూసింది. కథలు కూడా కొన్ని చదివి వుంటుంది. అయినా చంపకంలాంటి మనుషుల్ని బంధువులమని నెత్తికెక్కే-వారికంటె మిగతా అందరూ అభిమానంతో చూస్తారు. చంపకం తనయింట్లో వుండటం రాజమ్మకి లాభసాటి కూడాను. అద్దెకీ, భోజనానికీ, పాలకీ, పళ్లకీ, నెలకి అరవై డెబ్బై ముట్టచెప్పేది రాజమ్మకి చంపకం.

ఆ రోజు మధ్యాహ్నం చంపకం కాఫీ తాగి కిటికీ పక్క కుర్చీలో కూచునివుంది. దూరంగా రోడ్డుమీద "ఏమి జన్మము" అని ముష్టివాడిపాట వినిపిస్తోంది.

రాజమ్మ కాఫీగ్లాసుతీస్తూ "అమ్మాయి, రాత్రికి మీ అమ్మ వస్తారనుకుంటా. బండి ఆరుగంటలకు వస్తుంది. స్టేషనుకి వెళ్తావా, జట్కా తెప్పించనా?"

"వెళ్లేటప్పుడు నడిచి వెళ్తా—వచ్చేటప్పుడు బండిమీద వస్తాము."

"మధ్యాహ్నం డాక్టరు వచ్చేటప్పటికి నిద్దరపోతున్నావు. మళ్ళీ రమ్మని కబురంపనా?"

"ఇంక నేను డాక్టర్లని చూడదల్చుకోలేదు. నాకు మందు వద్దు. హాయిగా ఉంది."

"అదుగో అదే వొద్దు. మంచి మందిస్తాడు. వచ్చినప్పటి కంటె చాలా నయం" అంది రాజమ్మ. చంపకం వచ్చి నెల్లాళ్ళయింది. డాక్టరు ఆయుర్వేదం మందు యిస్తున్నాడు. చంపకానికి నరాల బలహీనం ఎక్కువయింది. పని ఎక్కువ చేయడంవల్ల వచ్చిందన్నారు. ఇంకో రెండు నెలలు మందు పుచ్చుకుంటే, తను మళ్ళీ తన పత్రికలో పడొచ్చు.

రెండురోజుల క్రితం రత్నమ్మ తను వొస్తున్నానని రాసింది. స్టేషనుకెళ్ళి ఆవిడను తీసుకురావాలి. అల్మరలోని లాల్‌జీ ఉత్తరం—తల్లి ఉత్తరం—రెండు ఉత్తరాలూ మళ్లీ చదివింది.

* * * *

మర్నాటి సాయంత్రం రాజమ్మా రత్నమ్మా వంటింట్లో కూచుని కబుర్లాడుతున్నారు. రత్నమ్మ తన కూతురికిపట్టిన అదృష్టం గురించి, విల్లుగురించి చెప్తోంది. రాజమ్మ నోరు తెరుచుకు వింటోంది.

చంపకం వొంటిగా షికారు వెళ్ళింది. మంచిగాలి కోసరం సాయింత్రం చాలాదూరం నడుస్తూండేది. మనిషి ముఖం చూడకుండా కట్టూ తీరూ చీరా చూస్తే- ఎంత అంద మయిన మనిషి- అనుకుంటారు. చక్కటి చీరెలంటే చంపకా నికి ఎప్పుడూ అసుసే. చంపకం డబ్బంతా తగలేస్తోందని గోల పెట్టేవాడు సత్యం. తన కూతురు రాణికి డాక్టరీ చెప్పించేం దుకు మిగలదేమోనని భయం.

“అది సంపాయించుకు ఖర్చుపెట్టుకుంటే మీకేం మధ్య” అనేది రాధ, వెంకట్రావు వెనకనుంచి సణిగినా.

“మరీ గొప్పలకు పోగూడదు. ఇదివరకు ఏ చీరె పడ్తే ఆ చీరె కట్టేది. ఇప్పుడు అన్నీ ఖరీదు కలవే కావాలి. అదెప్పుడూ అతివృష్టీ-అనావృష్టీ” అనేది రత్నమ్మ.

రత్నమ్మ సత్యందగ్గిరే ఉంటోంది. సంసారం- కష్ట సుఖాలు రాధతో మాట్లాడేది. ఇందు విషయమైతే చంప కంతో మాట్లాడేది. ఇందు ఆ రోళ్ళు హాస్పిటల్‌లో వుంటే రాధ ముచ్చటగా మూడుసార్లు వెళ్ళింది. వెంకట్రావు ఒక సారి తొంగిచూశాడు.

విల్లు సంగతి వినగానే చంపకం వెంటనే సత్యందగ్గిర కొస్తుందని తల్లీకొడుకులు భయపడ్డారు. మర్చిపోయిన లాల్‌జీ

పేరు విని వాళ్లు ఉలిక్కిపడ్డారు. లాల్‌జీకి చంపకంమీద మమకారం ఉన్నదన్న సంగతి వాళ్లిద్దరూ నమ్మారు. లేకపోతే ముక్కూ మొహం ఎరగని ముసలాడు అంత సొమ్మెందుకిస్తాడు? ఆనాడు అతనిమాటలు నమ్మి విల్లును పంపిస్తుంటే చంపకం సర్వనాశనమయేది. లాల్‌జీ చంపకానికి తాతగారి తండ్రిగారి అయేటంత పెద్దవాడు. తమ విల్లును అఖాడాంలో పడకుండా తప్పించుకున్నామనుకున్నారు వాళ్లిద్దరూ. చంపకం ఉత్తరంలో ఈ మాటలు చెప్పేందుకు స్థిరపరచుకున్నారు.

విల్లు సంగతి తెలిసిన మూడోనాడు రత్నమ్మ నర్సింగ్ హోముకి వెళ్ళగానే చంపకం క్రిందటివారం హాస్పిటల్‌నుంచి అమాంతంగా వెళ్లిపోయిందని చెప్పారు. చంపకం పెట్టుబట్టడం వల్ల ఏమీ అభ్యంతరం చెప్పలేకపోయారట. చంపకంతో శాంతాదేవికూడా వెళ్ళింది.

“మాఅమ్మాయి అన్ని పనులూ అకస్మాత్తుగా చేస్తుంది” అంది రత్నమ్మ. ఆవిడ కంఠంలో గర్వం కనిపిస్తోంది.

“తను అకస్మాత్తుగా హాస్పిటల్ వదిలి శాంతాదేవితో ఓపల్లెటూరు వచ్చాననీ” చంపకం రత్నమ్మకో చిన్న ఉత్తరం రాసింది. అందులో లాల్‌జీగురించిగాని, విల్లునుగురించి గాని ఒక్కమాట లేదు. రత్నమ్మ కూతురి నిశ్శబ్దంవల్ల ఆపద దాటిందనుకుంది.

ఇంట్లో సత్యం కష్టాలు ఎక్కువయిపోయాయి. కమల పోయినప్పటినుంచి సత్యం కమల డబ్బూ తన డబ్బూకూడా తగలెయ్యడం మొదలెట్టాడు. రత్నమ్మ చంపకం తనను నెలను

ఇచ్చే నూరాభై రూపాయల్లో యిల్లు పొదుపుగా గడుపు తోంది. రాణి స్కూలు ఖర్చు కూడా ఆవిడే భరిస్తోంది. ఇవన్నీ యిలా వుండగా కమల బతికుండగా యిచ్చిన పెద్దమనుష్యుల హామీమీద చేసిన అప్పు రెండువేలు దాకా ఉంది. అప్పులాళ్ళ బాధ ఎక్కువవుతోంది. సత్యానికి భవిష్యత్ శూన్యం. రత్నమ్మకి ఏం చెయ్యాలో తోచలేదు. అప్పు సంగతి తెలిసి కొంచెం సేపు ఏడ్చింది. కాస్సేపు కమలని తిట్టుకుంది. అప్పు నేది తీర్చాలిగా; ఆ సమయంలో చంపకానికి అనుకోకుండా డబ్బు వచ్చింది. చంపకానికి కోపం ఎక్కువయినా డబ్బు విషయంలో ఔదార్యం వచ్చింది. తల్లి నోరుజాచి అడుగుతే కూతురు ఏ నాడూ నిరాకరించలేదు. చంపకం అందరిమీదా చాలా దయగా ఉంటుంది. ఇందు పోయినప్పుడు ఎంతో ఏడ్చింది. రాధకీ పిల్లలకీ ఎప్పుడూ ఏదో ఇస్తూనే ఉంటుంది. సత్యం తనమీద విసుక్కున్నప్పుడూ, రాధా వెంకట్రావూ తనని రమ్మని పిలవక పోయినప్పుడూ రత్నమ్మ చంపకం దగ్గిరకు వెళ్ళేది. చంపకం తల్లిని పల్లెత్తుమాటన్నా అనకుండా వుంచుకొనేది. రక్తస్పర్శ!

"సత్యం, చంపకానికి డబ్బెందిగాదురా?"

"నేను ఫూల్‌ని" అన్నాడు సత్యం నవ్వుతూ. అతని ముఖం మళ్ళీ విచారంపోయింది. తల్లి సంరక్షణలో సత్యం లావెక్కి రంగుదేలాడు. మళ్ళీ నాటకం కంపెనీలో చేర్తున్నాడు. తన [illegible] యథాప్రకారంగా దాస్తుండేవాడు. తల్లి చూసి చూడనట్టు వూరుకునేది.

సాయంత్రం రాజమ్మతో మాట్లాడుతూ కూచున్న రత్నమ్మ ముఖంలో బహువుదీరిన తృప్తి కనిపించింది. కొడుకు మళ్ళీ దక్కాడు. వాళ్ళిద్దరూ మళ్ళీ ఒకరి రహస్యాలు ఒకరు పంచుకుంటున్నారు. కమల యీ లోకంలో లేదు. రత్నమ్మ ఇప్పుడిప్పుడే కమలమాట వచ్చినప్పుడు జాలి ప్రకటిస్తోంది. సత్యం నాటకాలగురించి పూర్వంలా తల్లితో డాబులు వాళ్ళ గక్కేవాడు.

రాజమ్మతో మాట్లాడుతూ రత్నమ్మ పూర్వం వున్న ఊళ్ళోవున్న రోజుల్లోకి మళ్ళీ గర్వంగా వుంది. ఆ రోజుల్లో అందరూ తన్ని గౌరవించే వారే! ఇప్పుడు రాజమ్మ గొంతు విన్తోంది. జుట్టు తెల్లబడింది. హృదయం మెత్తబడింది. రత్నమ్మ చేతికి యింకా డబ్బురాలేదు. ఎల్లా అడగాలా అని ఆలోచిస్తోంది.

"అందం – చందం పత్రికలో అనూరాధ రాసిన నవల చదివాను. అనూరాధ–చంపకం ఒకటేనని మీరు చెప్పేదాకా తెలియదు. కథ పూర్తి చేసే దాకా మరో పని ముట్టలేక పోయాను" అంది రాజమ్మ.

"అవును బాగా రాస్తుంది మా అమ్మాయి" అంది రత్నమ్మ గర్వంగా.

రత్నమ్మ తనకూతురి కథలూ, నవలలూ ఏనాడూ చదవలేదు. "రామాయణం భాగవతాలు" చదివిన రత్నమ్మ "ప్రశ్నలూ – ఉత్తరాలు" శీర్షికను చంపకం రాసినది ఒక్క సారి చదివి హడలిపోయింది. వాటిల్లో అందం చేసుకోడం,

భర్తల్ని ఆకర్షించడం, విడాకులు యివన్నీ చదివి, పత్రికలు చదివి ఈ కాలపు పిల్లలు ఎందుకు చెడిపోతున్నారో గ్రహించింది. పెళ్ళయిన స్త్రీలకుకూడా తెలియని విషయాలు చంపకానికి తెలుసు. రాధతో కూడా అంది ఆ సంగతి. చెప్పేంత కూతుర్ని ఏమంటుంది?

ఇతర్లు తనకూతుర్ని మెచ్చుకుంటే వినటానికి బాగా వుంటుంది. ఈ పొగడ్తల మధ్య విల్లు సంగతి జ్ఞాపకం వచ్చింది. ఈ డబ్బువల్ల చంపకం యింక రాయడం మానేస్తుందా? "అన్నిటికన్న ఆశ్చర్యమేమిటంటే యీ డబ్బు రాసినాయన మా అమ్మాయిని ఒక్కసారే చూశాడు. ఒకటిన్నర సంవత్సరాల క్రితం అనుకుంటా. అప్పటికి చంపకం చాలా చిన్నది. చంపకాన్ని చూస్తే ఆయనెందుకో చాలా యిష్టపడ్డాడు. దాన్ని మర్చిపోలేకపోయాడు. ఆ డబ్బురావడం మాకు చాలా ఆశ్చర్యం అయింది."

"వెనకనే యిచ్చివుంటే అమ్మాయి హాయిగా ఖర్చు చేసుకునేది. ఇప్పుడంతా అయిపోయిం తరువాత వచ్చింది" అంది రాజమ్మ తన ధోరణిలో.

"మా అమ్మాయి పైకి కనబడే దానికంటె చాలా చిన్నది. చిన్నప్పుడు ప్రమాదం జరిగింది."

"చంపకం చాలా మంచిమనిషి. మనిషి అందచందాల్లో తెక్కువకాదు. ఆవిడ కళ్ళల్లోనే ఉంది కాంతి. భోజనానికి లేస్తారా? అమ్మాయి వచ్చేదాకా వుంటారా?"

ఉంటానంది రత్నమ్మ.

దొడ్లో అరుగుమీద కూచుంది. జీవితం నాటకానికి ఓర్పు నేర్పింది. ఇందుని క్షమించింది. చంపకం ఇందుని నిజంగా అనుమానించిందా ? చంపకం ఇందు పోయినప్పుడు ఏడ్చినమాట నిజమే ఇందుకు అనుమానించానే— అనికూడా వచ్చింది.

రాళ్ళమీద ముళ్ళమీద నడిచిన మనుషులు పసిరికలో పూలబాటమీద నడుస్తున్నారు. రత్నమ్మ సంసారంలోని లోపాలు – కోపాలుపోయి అంతా హాయిగా కూడు పెడుతూ... రత్నమ్మ చంపకాన్ని దయతో చూస్తుంది. అప్పుడప్పుడు వచ్చి పదిరోజులు గడుపుతూంటుంది. తను ఒకసారి తొందరగా వెళ్ళిపోవాలి. పాపం సర్వం డబ్బుకోసం బాగా... పడుతూంటాడు. వాడి భోజనానికి ఇబ్బంది.

"షికారు బాగుందా ?" అని నవ్వుతూ చంపకాన్ని పలకరించింది.

౨౧

"ఈ ఆలోచనలు ఎందుకొస్తున్నాయో నేను చెప్పలేకుండా ఉన్నాను. నీ గురించిన తలపు యీ చివరిరోజుల్లో రావడం ఆశ్చర్యంగా ఉంది. ఈ మధ్యకాలంలో నీ మాటే మర్చిపోయాను. ఏదో జన్మాంతర బాంధవ్యమై ఉండాలి. నా చేయి నీకు సరిగా అందించలేకపోయానా ? – లేక నీ అమ్మా అన్నా నిన్ను రహస్యంగా పొత్తిపెట్టారా ? బలవంతంగా పనులు చేయించడం నా మతంకాదు. వెర్రి నమ్మకాలతో

నా అంతరాత్మ తర్కంలో పడింది. నే నిస్తున్న యీ కొద్ది ధనమూ, నీ ఆనందాన్ని హెచ్చించగలదని నా ఆశ. దీన్ని నువ్వు అంగీకరిస్తావని తలుస్తా."

హృదయాన్ని కదిలించే ఉత్తరం. ప్రతిమాటలో సందేశమూ దీవనా కనిపిస్తున్నాయి. ఏభై అరవై వేల రూపాయల షేర్లు కొద్దిధనంగా భావించే ఆ కోటీశ్వరుణ్ణి తను ఒక్క నాడూ చూడలేదే అని చంపకం ఆశ్చర్యపడుతోంది. చిను గుల పరికిణీ రోజుల్లోని కల లీనాడు నిజమయాయి. చీకట్లో కలలుకనేది. ఆనాడు కలల చీకటి – ఈనాడు జీవితం చీకటి.

చుట్టూవున్న బంధనాలు తెగిపోతున్నాయి. తెంచుకునేందుకు ప్రయత్నిస్తోంది. సంవత్సరానికి మూడువేల రాబడి. నెలకివచ్చే రెండువందలయాభై, తనకి హాయిగా సరిపడుతుంది.

తల్లి తీర్థయాత్ర లనేటప్పటికి చంపకం తల తిప్పేసింది. తనకు తీర్థయాత్రలెందుకు ? మంచి యిల్లు కట్టించుకోమని తల్లి సలహా. ఇల్లు మాటంటే చంపకానికి అసహ్యం వేసింది.

చంపకం ఉత్తరం మడుస్తూ అనుకుంది. ఉత్తరం లేకుండా విల్లు వచ్చివుంటే తను సంతోషంగా డబ్బు తీసుకునేది. ఇల్లు కట్టుకునేది. లేకపోతే తీర్థయాత్రలు చేసేది. సత్యానికి సంతోషంగా సాయం జేసేది. పెద్ద డాక్టరుకి చూపించి తనముఖాన్ని బాగుచేసుకునేది. రాధ పిల్లలకూ, రాణీకి ఆనందంగా చదువుకు సాయంచేసేది. వాళ్ళంతా గోతి కింద నక్కల్లా తను ఏం చేస్తుందా అని ఎదురుచూసేవారు.

ఉత్తరం విల్లును పాము కాటువేసింది.

ఉత్తరం డ్రాయరులో పెట్టింది. ముఖం కఠినంగా వుంది. తల్లి ఊరికెళ్ళే ప్రయత్నంలో ఉంది హాల్లోకివచ్చి బండికి కబురంపి, చంపకానికి దగ్గరగా వచ్చింది తల్లి. చంపకం తల ఎత్తలేదు.

"అమ్మాయ్"

చంపకం తల తిప్పింది కుర్చీలో కూచుని.

"అంతా సిద్ధం అయిందా ? బండి వచ్చేందుకు పది నిముషాలు పడ్తుంది. నీతో మాట్లాడాలి."

రత్నమ్మ కూచుంది. గుండెల్లో పీచుపీచు మంటోంది.

"లాల్ జీ ఉత్తరం రాశారు" తల్లి సత్యం దగ్గరకు వెళ్లాలనే తొందరమరాసి చంపకం లోలోన చిరాకుపడుతోంది.

"నాకు తెలుసు, వకీలు ఉత్తరంకూడా ఉందని చెప్పాడు"

"చాలా గమ్మత్తుగా వుందీ వుత్తరం. నాకు అర్థం అవడంలేదు. ఆయన మనింటికొచ్చినట్టు రాస్తున్నారు" అంది తల్లి వంక పరిశీలనగా చూస్తూ.

"అతను మీా సంగీతం టీచరింట్లో నిన్ను చూశాడుట. నువ్వానాడు మాతో చెప్పలేదూ ! అతను."

"అవును. జ్ఞాపకంవుంది. ఆయన ఇంకా ఏదో ఉన్నట్టు రాశారు. నిన్నూ సత్యాన్నికూడా చూశానన్నట్టుగా వుంది.

"నే నెప్పుడూ అతన్ని చూడలేదు" అంది రత్నమ్మ.

"సత్యం చూశాడా ?" అంది చంపకం.

రత్నమ్మ డబాయిస్తోంది. "వాళ్లెల్లా చూస్తారు ? సత్యం విశా సంగీతం టీచరింటికి ఎప్పుడూ వెళ్ళలేదు. వాడికి లాల్ జీ లాంటివాళ్ళను కలుసుకునే అవకాశమే వుంటేనా ! అతను చాలా పెద్దవాడుట. పేపర్లో అతనిగురించి పడుతూ వుంటుందిట. ఏవో కథలుకూడా చెప్తారు, ఏదన్నా అసందర్భముగా రాశాడా ?" ఇంక ఆగలేకపోయింది.

"ఏదీ యిల్లాగే ?"

"లాల్ జీ సత్యాన్ని కలుసుకు నన్నుగురించి ఏమన్నా మాట్లాడారా ?"

"నువ్వు ఉత్తరం చూపకపోతే అతనేం రాశాడో నే నెట్లా చెప్పగలనూ ? అతను పోయేటప్పటికి చాలా పెద్దవా డయ్యాడు. నిన్నుచూసి భ్రమపడి వుండాలి. అతనేం రాశాడో అతనికే తెలిసుండదు."

"ఆయన ఎప్పుడూ రాలేదన్నమాట. సత్యాన్ని కలుసు కోలేదంటావ్. నా గురించి మాట్లాడలేదు. అవునా ?"

సత్యం తప్పును కప్పిపెట్టేందుకు రత్నమ్మ నిజాన్ని తొక్కిపెట్టింది.

"లేదు... లేదు...ఎల్లా వస్తాడూ" అంది.

"ఆయన నాకు సహాయం చేస్తానని సీకన్నా సత్యాని కన్నా ఎప్పుడన్నా రాశాడా ?"

"లేదు-చంపకం" జరిగిన విషయం చంపకం తెలుసు కోకుండా వుంటే మరీ మంచిది అనుకుంది రత్నమ్మ మనసులో.

తల్లి కూతురువంక దొంగచూపు చూసింది. చంప కాని కిదేం బోధపడటం లేదు. తెప్పరిల్లి, "సగ నీ పెట్టె తెస్తాను. జెట్కా వచ్చింది. హాండ్ బాగ్ తీసుకొస్తా" అంది చంపకం లోపలికెడుతూ.

"చంపకం"...

"ఆ"

"సత్యం చెక్కుమాట...చెక్కు లేకుండా నే వెళ్ళడం ఎట్లా?"

లోపలికెళ్ళి చంపకం హాండ్ బాగూ చెక్కూ తీసుకొచ్చింది.

"చెక్కు రాయడంలో తప్పురాశావు. చూడు- రెండు వందలకే రాశావు. సున్నా ఎగిరిపోయింది" కిందనుంచి రాజమ్మ కేక పెట్టింది.

"నేను సరిగ్గానే రాశాను" అంది పెంకిగా చంపకం.

"నువ్వు రెండువేలు యిస్తానన్నావు. మర్చిపోయావా?" నెమ్మదిగా అంటోంది, ఎవరన్నా వింటారేమోనని.

"ఆ విల్లు నాకు చెందుతే యిద్దామనుకున్నా - కాని రెండువందలకు పైన నే నివ్వలేను."

బండివాడు తొందరపడుతున్నాడని కిందనుంచి మళ్ళీ కేక.

"నీ కా డబ్బు తొందరలోనే వస్తుందిగా! ఇంక ఖర్చు లంత వుండవు..."

"నేనా డబ్బు పుచ్చుకోలేనమ్మా. కష్టపడి పనిచేసి డబ్బు సంపాయించాలి."

"నువ్వు నా కా మాట చెప్పనక్కర లేదు"

"ఉత్తరం రాసినప్పుడు లాల్ జీకి మతి స్థిరం లేకపోతే విల్లు రాసినప్పుడూ మతి స్థిమితం వుండదు. నా కా డబ్బు తీసుకునే హక్కు లేదు. ఆ డబ్బు ఇంకెవరికన్నా నేమో!"

"అతనికి మతి స్థిమితం లేదని నేను చెప్ప లేదు. మనం తెలుసుననే భ్రాంతి ఏమన్నా వుందేమో!"

"ఆయనకి నిజం తెలియకపోతే నాకు డబ్బు తీసుకునే హక్కు లేదు. నే నా డబ్బు ముట్టుకోను. నాకు మటుకు మన స్వాతంత్ర్యం వద్దూ! నేనంత డబ్బు కిబ్బందిపడటం లేదు. నావుద్యోగం నాకుంది-నాకా డబ్బు అనవసరం."

"పాపం, సత్యం!" మళ్ళీ ఆవిడ రాళ్ళల్లో ముళ్ళలో నడుస్తోంది. "సత్యానికి ఏం చెప్పను?" అని కుర్చీలో కూలబడి చంపకంవంక చూసింది.

"అప్పులవాళ్ళని మరికొద్దిరోజులు ఆగమను"

"ఎన్నిసార్లు ఆగమన్నాడు! పాపం, ఆశతో చూస్తూంటాడు."

"నేనేం చెయ్యలేను. చంపకం మనసు కరుడుకట్టుకు పోయింది. తన సంపదని వాళ్ళు ఎంతో తొందరగా పంచుకునే

ఏర్పాట్లో వున్నారు. "నేను మనుషుల్ని మోసగించలేను—గ్రహాలు లని మోసగించకుండా సత్యానికి సాయం చేస్తాను. లాల్ జీ వుత్తరంలో అర్థం లేకపోతే, అతను మతిలేనప్పుడు రాసుండాలి—అందుచేత అతని డబ్బు నేను ముట్టుకోను."

బండివాడు దెబ్బలాడుతున్నాడంది రాజమ్మ.

"వాణ్ణి పొమ్మనండి—ఈ పూటకి వెళ్ళను" అంది రత్నమ్మ. ఆమె కళ్ళకి స్టేషన్లో తనకోసం ఆదుర్దాగా ఎదురు చూసే సత్యం మొహం కనిపించింది.

"చంపకం—లాలాజీ మనింటికొచ్చాడు."

చంపకం పెదవి మెదపలేదు.

"అతను నిన్ను చూశాడు. నిన్ను సినిమాలోకి తీసుకోవాలని అతని వుద్దేశం. నిన్ను కలకత్తా తీసుకెళ్తానన్నాడు. నీకు నేర్పువుందని అతని అభిప్రాయం" రత్నమ్మ దగ్గి అంది; "నువ్వు చాలా అందంగా వున్నావనికూడా అన్నాడు."

"నా కదంతా ఎందుకు చెప్పలేదు?"

"నేను తప్పుచేశాననుకోను. నేను చేసిందంతా నీ మంచి కోసమే. నిన్ను వొదిలేందుకు నా మనసొప్పలేదు. అతను పరాయివాడు."

"నా కదంతా ఎందుకు చెప్పలేదు—యిన్నాళ్ళూ?"

"నీకసలే గర్వం, దాంతో కొమ్ములు మొలుస్తాయి. రంగనాథం నీకు నాలుగురాళ్ళు యిస్తున్నాడు. సంసారం గడ

వటం ఓ పక్క కష్టంగా వుంది. నువ్వు వుద్యోగం వదిలి, కల కత్తా నడితే, ఈపాటికి ఎందుకూ పనికిరాకుండా పోదువు. నలు గురు నోళ్ళల్లో పడేది నీ బ్రతుకు. నేను చెప్పేది అర్థం అవు తోందా ? నేనూ సత్యం నీకు చెప్పకపోవడమే మంచిదని యిన్నాళ్లూ దాచివుంచాము."

చంపకం కిందకి చూస్తోంది. "మీరు చెప్పివుంటే బాగుండేది."

"అవును. మేము చెప్పివుండాల్సింది. నాకు చాలా విచారంగా వుంది. ఆయన రావడం చాలా గమ్మత్తుగా ఉంది. అంతా కొత్త-నువ్వింతకన్నా కష్టపడాలిసొచ్చేది. నీ రచనలు ఎంత పేరు పడ్డాయో - సినిమాల్లో నీ కంతపేరు వచ్చేదికాదు."

"సత్యం చెప్పాడా ?" అంది చంపకం హేళనగా. ఆమె కంఠం వణుకుతోంది. కన్నీళ్ళు ఆగడంలేదు. "ఒకమనిషి నా కోసంవచ్చి నా సమర్థతనీ అందాన్నీ మెచ్చుకున్నాడన్న ఆలోచనైనా మిగిలేది."

మేము ఏది మంచిదనుకున్నామో అది చేశాము. నువ్వు ఉండవేమోనని భయపడ్డాం. ఒకవేళ నువ్వు రాణించ లేకపోతే జీవితమేమయేది ? మేము మంచిదనుకొని చేశాము, అది తప్పో వొప్పో - ఏం చెప్పగల మీనాడు ! నీ మేలుకోరే చేశాం."

"అవును. కొంతనుంది యితన్నకి తప్పుచేస్తాను. నాకు చెందేదాన్ని నేను పొందకుండా మోసగించారు.

రత్నమ్మ చేతుల్లో ముఖం వుంచుకు ఏడుస్తోంది.

"సత్యం ఎందుకుచేశాడో నాకు తెలుసు. ఎల్లాగయితే యేం? చేతులు కాలింతరువాత ఆకులు పట్టుకోడం అనవసరం. కాని నాకు కమ్మటి జ్ఞాపకంగూడా మిగలకుండా చేశారు—తల్లీ, అన్నగారూ. ఇంకా టైముంది రయిలుకు. సత్యం కనిపెట్టుకు ఉంటాను; నువ్వు వెళ్ళు."

"మా మీద కోప్పడకు. ఇల్లా నిన్ను వదలి వెళ్ళడం నా కిష్టం లేదు".

"అమ్మా, నువ్వు కొడుకుని నమ్ముకున్నావు. ఒకటికి పదిమాటలెందుకు? సంగతేదో తెలిసింది. ఇక నువ్వు వెళ్ళు."

"మేం కిరాతకులం కాము తల్లీ"

"ఇంక దాన్నిగురించి ఆలోచించకు. అన్నీ సిద్ధంగా ఉన్నాయిగా!"

"చంపకం"

"ఆ..."

"సత్యం చెక్కు..."

చంపకం ఆశ్చర్యపడ లేదు; ఇదివరకు మల్లే డబ్బిస్తూ ఆనందించనూ లేదు. బీరువా దగ్గరకు వెళ్ళి చెక్కురాసి తీసుకు వచ్చింది. "బండిలో కూచో వస్తున్నా."

"నువ్వు చాలా మంచిదానివి. సత్యం నీమేలు మర్చిపోలేదు. నిన్ను చూసేందుకొస్తాడు"

"సత్యాన్ని రావద్దన్నానని చెప్పు. ఎవ్వరినీ చూడాలని లేదు. నా దగ్గరకు మీరెవరూ యింక రావద్దు. అంతే - ఇంక రాకు- నేను ఉన్నచోటికి."

"వాళ్ళంతా నిన్ను గురించి ఆదుర్దా పడుతున్నారు. నీ కిప్పుడు వొంట్లో కాస్త నయం అయిందనుకుంటా !"

"ఓ చాలా బాగుంది. నన్ను కొన్నాళ్ళు వొంటరిగా వదలండి" చంపకం తలుపు తెరిచింది.

"నువ్వు పనిచేస్తావా ? బాగా విశ్రాంతి తీసుకు నేదాకా పనేం చెయ్యకూడదు. రాజమ్మగారూ, యీ భారం మీామీద వేస్తున్నా. అది శ్రమపడకుండా చూసేబాధ్యత మీామీద ఉంది. అదేం రాయకూడదు."

"నేను చూసుకుంటా లెండి" అంది రాజమ్మ. తల్లిని రైలెక్కించేందుకు స్టేషనుకుకూడా వెళ్ళలేదు చంపకం.

ఆ రాత్రి చంపకం ఎంతో ఏడ్చింది. లాల్‌జీని గురించి, రాజాను గురించీ తలుచుకు తలుచుకు ఏడ్చింది. ఒకరు అదృష్టం ! మరొకరు ప్రేమ. రెండూ వేళ్ళమధ్యనుంచి జారిపోయాయి. తనబతుకు ఆఖరాలు కాలానికి వచ్చేసింది.

ఒక చిన్న కాయితం ముక్కమీద రాసింది. "నా ముప్పైఏళ్ళ జీవితమొక విషాదవాహిని. రాసిన కథలన్నీ

పోట్టకూటికే. నా రక్తబంధువులే నన్ను కాకుల్లా పొడుచుకు తిన్నారు. కాని లోకంలో ఎంతో ప్రేమా కరుణా ఉన్నాయి."

తెల్లవారి రాజమ్మ కాఫీ తెచ్చేవేళకి చంపకం రోజూ మాదిరిగా లేవలేదు. పక్కమీద బిగుసుకుపోయిన శరీరం. స్లీపింగ్ డోసు ఎక్కువ వేసుకుందన్నాడు డాక్టరు.

